316

# VIDYUNMALA.

*An original Telugu Drama in Five Acts*


BY

**Rajah M. BHUJANGA RAO Bahadur**
**Zamindar**

*Author of the Life of Queen Victoria and Translator of Abhignana Sakunthalam, Uthara Rama Charitram, Prasanna Raghavam Etc..*




WITH A FOREWORD BY

***K. V. REDDI NAIDU, B. A., B. L..***
***High Court Vakil.***
**MEMBER OF THE IMPERIAL LEGISLATIVE COUNCIL.**


*1920.*

***Printed at the Rama Press, Ellore.***


 [Price. Rs. 0-12-0.

# పురుషులు.

1. సుదర్శనుడు—కథానాయకుడు.
2. విద్యాధరుడు—సుదర్శనుని మంత్రి.
3. కంచుకి—ద్వారపాలకుడు.
4 ప్రజలు—కాశ్మీరదేశ పౌరులు.
5 సునందుడు—సుదర్శనుని వేడుక చెలికాడు.
6. ప్రథమదొంగ—
7. ద్వితీయ దొంగ—
8. కరాళుడు—దొంగలకధిపతి.
9. నికుంభుడు—కరాళుని సహకారుడు.
10. ప్రథమపౌరుడు—ఉజ్జయనినివాసి.
11. ద్వితీయపౌరుడు— ,,
12. భటులు—
13. ప్రథమపౌరుడు } పురుష వేష ధారులగు
15. ద్వితీయపౌరుడు } విద్యున్మాల చతురికలు.
16. భానుమంతుడు—ఉజ్జయని సార్వభౌముడు.



# స్త్రీలు.

1. పరివ్రాజిక—యోగిని వేషధారి.
2. విద్యున్మాల—కథానాయిక.
3. చతురిక—విద్యున్మాల చెలికత్తె.

# A Foreward.

A long standing friendship of an intimate nature is perhaps blind to the defects of any production of this kind. But even the most austre critic will perhaps find it difficult to discover many serious flaws in this work of imagination. How far this drama will find favour with the public when put on boards is a matter of speculation. But this much can be said that as a pure piece of literature it will occupy an abiding place in the great works of the Telugu language. The purity of style, the sweetness of poetry and the flights of imagination; can be seen in almost every line of this work The plot is not drawn from history or from ancient mythology It is so to speak. a novel drama, a child of imagination. Underneath the main story runs a current of great desire to blend a high nationalistic patriotism with genuine loyalty. The bride of liberty is to be given away in marriage by the Sovereign of a world-wide empire to a great subject nation as a reward of noble deeds in the hour of need.

For the first time in our literature a picture is drawn by word painting by one of the noblest sons of India, wherein the possibility of a combination of patriotism and loyalty in a subject nation is depicted in glowing colours.

As can be seen from the work, the author is a close student of the current politics of our country and had utilised his poetic genius to no mean purpose. The poet is no stranger to the Telugu reading public, and reveals his piety and the reader catches almost at every point the pure atmosphere which pervades around this work. Let the gentle reader see for himself whether what is said here is borne out or not by going through the work.

K. V. REDDI.



రాజా యం. భుజంగరావు బహద్దరు జమీందారు.



శ్రీ

# వి ద్యా స్నా ల

## నాంది.

మ॥ తన సంకల్పమునన్ జగద్వలయ ముద్యల్లీల సృష్టించి, భ
క్తనిధానంబయి, కాంక్షితార్థముల నుల్లాసంబునం గూర్చి, నూ
తన సాక్షాత్కృతిచే సుదర్శనుఁడనన్ దైవారి, విద్యాప్రభన్
ఘనత న్వెల్గు మహామహుండు ఖలశిక్షుం జేసి మి మ్మోముతన్॥ 1

సూత్ర— (నాంద్యంతమున)

(సభ్యులపైఁ బుష్పాంజలిఁ జల్లి) ఆహా! నేడు మహాసుదినము. అనవద్యవిద్యా విశారదులై నూతన శారదామూర్తు లనందగు పండిత చక్రవర్తులచే నలంకరింపఁబడిన యీ సభారంగము నా యంతరంగము నాకర్షించుచున్నది. కాన నపూర్వరూపక ప్రదర్శన చాతుర్యంబుచే వీరల రంజింపఁజేయఁ గల్గుటయే కదా నా జన్మసాఫల్యము. ఇందు నాకు సహాయకారిణియగు ప్రేయసిం బిలిచి కర్తవ్యంబు నాలోచించెదనుగాక! [తెరవంకఁ జూచి] సుందరీ!

నటి—[ప్రవేశించి] ఆహా! నేఁడీ సభామందిరము శరత్పూర్ణిమాచంద్ర చంద్రికాప్రసారంబుచేఁ బరిపూర్ణ వికాసముం గాంచి భాసిల్లు కైరవాకరంబుఁబోలెఁ దోఁచుచున్నది. నాథా! నేఁడీ సభాస్తారుల యభినవ ముఖోల్లాసమున కెద్దియేని గొప్ప కారణ ముండియుండునని యూహించెదను. నీ యభిప్రాయ మేమి?

సూత్ర—భామినీ! పరేంగితజ్ఞాన చాతురీ ధురీణవగు నీయూహలు నిరర్థకము లగునా! నిక్కముగఁ గలదొక్క కారణము.

నటి—ఏమది?

సూత్ర— మన భరతఖండమునకు జార్జి సార్వభౌముఁ డొసంగిన స్వారాజ్య పట్టాభిషేక మహోత్సవమే వీరి యుల్లాసమునకు ముఖ్యకారణము.

నటి—స్వరాజ్యపట్టాభిషేక మన కేమి?

సూత్రి—వలసరాజ్యములకుం బోలె మన ఖండంబునకు స్వతంత్ర్య పరిపాలనం బొసంగి డిశెంబరు యిరువది నాల్గవ దినమగు క్రీస్తుమసు పండుగకుం బూర్వదివసంబున 1919 వత్సరంబున మన పంచమ జార్జి సార్వభౌమునిచే మహానుగ్రహంబుం బ్రదర్శింపం బడియెం గానం దదీయోత్సవ సూచకంబుగా నిమ్మహామహులచేం గొల్వుకూట మేర్పడియున్నది.

నటి—అట్లయిన మనకుం గర్తవ్యమేమి?

సూత్రి—అభినవ స్వరాజ్య మహోత్సవ మహానందిత హృదయారవింద మగు నీ సభాజన బృందముయొక్క యానందమును తదనుగుణంబగు నభినవరూపక ప్రదర్శనంబుచే ద్విగుణీకరించుటయే.

నటి—తదనుగుణంబగు రూపకంబు లభించినప్పుడుగదా మన ప్రయత్న సాఫల్యము?

సూత్రి—లభించుటం బట్టియే ప్రయత్నించుటకుం గారణ మయ్యెను.

నటి—అట్టి రూపక మేమి?

సూత్రి—ఆరూపక మెద్దియో తొలుదొల్త నాందీవాదమునందే భరతవాక్యముఖంబున సంప్రాప్తముగా సూచింపబడినది.

నటి—ఆ నాందీవాదము విన్నదాననైనను నా కందలి కథాసందర్భము గోచరింపలేదే?

సూత్రి—కావుననే యభినవరూపకంబని మొదటనే చెప్పియుంటిని.

నటి—అట్లయిన దానిపేరేమి?

సూత్రి—విద్యున్మాల.

నటి—నాథా! ఈ విద్యున్మాలయందలి కథాంశంబునకును, మన యభినవ స్వరాజ్యవిషయమునకు నుగల యానుగుణ్యమేమి?

సూత్రి—సీ॥ యవనరాజ్యలక్ష్మి నలరారు భానుమ
తీప్రతిచంద్రుండు జార్జిప్రభుండు,
అఖిలహృత్కమనీయమైన విద్యున్మాల
విహరించు భరతస్వరాజ్యలక్ష్మి,

సకలరాజద్రోహి సంరంభ మణఁచు హైం
దవలోకమూర్తి సుదర్శనుండు,
స్వార్థపరాయణస్వాంతులై తిరుగు రా
జద్రోహులే కిరాతాదిఖలులు.

గీ॥ హైందవజనంబు మది స్వరాజ్యాభిలాషఁ
బెనఁగులాడు రాజద్రోహులను మలంచి
యుండ, జయమంది జార్జిభూవిభుండు. వలస
రాజ్యములఁబోలె నొసఁగె స్వరాజ్యలక్ష్మి॥ 2

నటి—నాథా! ఆంగ్లేయప్రభువు లట్టివారే—

ఉ॥ హూణులు రాష్ట్రసంచయ సముజ్జ్వలపాలన ధర్మమార్గపా
రీణులు, శత్రుసంహరణ కృత్యవిధాన వివేకమాతన
ద్రోణు లపాంగదృష్టి పరిపోషిత సర్వదిగంతభూపతి
శ్రేణులు హైందవప్రజ దరింప స్వరాజ్య మొసంగు టబ్రమే! 3

అహా! క్రీస్తు తాప్రస్తుతంబుల నింత ప్రస్తుతపాత్రంబుగా సంఘటింపఁజేసి పరమాహ్లాదముం గూర్చు నీ కవిశిఖామణి యెవ్వరు?

సూత్ర—మనచేఁ బ్రదర్శింపఁబడు రూపకసంఘములఁ దరచుగా నెవ్వని పేరు మనల నానందసాగరంబున నోలలాడించుచున్నదో యట్టి కవిశిఖామణి పేరుఁగూడ నీకుఁ జెప్పవలసివచ్చినదా!

నటి—ఓహో! తెలిసినది.

సీ॥ భవభూతి వాక్సుధాభవరసస్ఫూర్తి ను
త్తరరామచరిత నాంధ్రముగఁ జేసి,
కాళిదాసప్రౌఢలీలఁ జొప్పించి శా
కుంతలంబును దెనుంగునకుఁ దెచ్చి,
జయదేవపదగుంభ చాతుర్య మొసరఁ బ్ర
సన్నరాఘవ మాంధ్రసరణిఁ గూర్చి,
"షేక్స్పియర్" కవిచంద్రు చిత్రనాటకసిఁ జాడ
మతిపేర మన యాంధ్రమాతకిచ్చి,

గీ. ఖ్యాత శశిరేఖ, పాండవాజ్ఞాతవాస,
కృష్ణ, చిత్రహరిశ్చంద్ర, కృతులుఁ గాక
పెక్కు శాస్త్రప్రబంధముల్ వెలయఁజేయు
మంత్రిప్రెగ్గడ భుజగరాయ మనుజవిభుఁడు॥ 4

సూత్ర—ఆహా! నీ మతిచాతుర్యము. చెప్పకయే గ్రహించితివే!

నటి—చెప్పకయే చెప్పఁగల చాతుర్యము నీయధీనమై యుండఁగా నిందు నాప్రజ్ఞ యేమికలదు?

సూత్ర—గీ. తరుణి! యీదివ్యరూప సుదర్శనమున
కెన్న విద్యాధరత్వంబు వన్నెఁ దెచ్చె
ధారుణీధవుఁడైన సుదర్శనునకుఁ
బోధయితా మంత్రి విద్యాధరుండు వాఁడె

(నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రస్తావన.

---



శ్రీ

# విద్యున్మాల.

ప్రథమాంకము.

రంగము—కాశ్మీరనాథుని కొలువుకూటము.

ప్రవేశము—[కాశ్మీరనాథుండగు సుదర్శనుండు, మంత్రి విద్యాధరుండు, ఉచితపరివారము.]

సుద—అమాత్యవరా! మా పరిపాలనంబున వర్ణాశ్రమధర్మంబులును, దేవబ్రాహ్మణారాధనంబులు నుచితాచారమున నిర్వర్తింపఁబడుచున్నవా?

విద్యా— మ॥ హరిలీలా విభవాంశసంభవుఁడవై యత్యంత శౌర్యక్రమ
స్ఫురణంబు న్నయమార్గకౌశలము సొంపుం బెంపు దీపింప నీ
ధరణీమండల మేకచక్రముగ నుద్యచ్ఛక్తిఁ బాలింప, నె
ర్వ్వర వర్ణాశ్రమ కర్మ మర్మముల ధర్మగ్లాని వాటిల్లునే? 1

క॥ పరిపూర్ణ బ్రహ్మముకడ
నరయఁగ నజ్ఞానలేశ మబ్బనిభంగిన్
నరపాలచంద్ర! యుష్మ
త్పరిపాలనసరణి నొక్క యధర్మముగలదే?॥ 2

సుద—మన కరిగాపులై రాజులందఱు విశ్వాసపాత్రులై సంచరించుచుందురా?

విద్యా—యుక్తకాలమునఁ గప్పముల నొప్పుగా నర్పించుచు నిరంతరము నేలిక కభ్యుదయముఁ గోరుచుండిరి.

గీ॥ నరవరేంద్ర ధనుర్ధ్వనంబువలన
మహితసామంతఘనరాజమండలములు

తతసమున్నత భూభృత్పదంబులందు
భూరివర్షంబు గురియుటబ్బురమె? దేవ॥ 3

సుద— మంత్రిశేఖరా! క్షేమము సుభిక్షముగ నున్నదా?

విద్యా— సీ॥ వలయువేళల యుక్త వర్షముల్వర్షించు;
సకలభూజ సర్వసస్యములు బండు;
తృణకాష్ఠజలసమృద్ధిగ నొప్పు దేశంబు;
పశువృద్ధి లాభోన్నసంపదలు బొదలు;
జారచోరాది దౌష్ట్యములు గానగరావు;
వివిధదుష్టజంతు విభీతి లేదు;
ప్రజల కన్యోన్య వైరములు జూపట్టవు;
దుర్మరణంబులు దొడరబోవు;
గీ॥ రాజ! యీగతి శ్రీరామ రాజ్యమట్టుల
గొదవ యొక్కింత లేక మిక్కుటపుసిరుల
బూర్ణమై నీదు రాజ్యంబు మూడుపూవు
లారుకాయ లనంగ జెంపారుచుండు॥ 4

సుద— సచివోత్తమా! అతిథిసత్కారంబు కొఱంతలేక నిరంతరము నెరవేరుచున్నదా?

విద్యా— దేశసంచార మొనర్చు నతిథులకు యతుల కతి భక్తిశ్రద్ధలతో నాతిథ్యము జరుగుచునే యున్నది.

కంచుకి— [ప్రవేశించి] దేవా! పుణ్యక్షేత్రపర్యటన మొనర్చు నొక పరివ్రాజిక దేవర దర్శనార్థమై ద్వారముకడ వేచియున్నది.

సుద— స్వార్థపరిత్యాగులై దేశసేవ నొనర్చు భాగవతుల యాగమనమునకుగూడ నిరోధమా? పూజ్యురాలిని వేగముగా బ్రవేశపెట్టుము.

పరివ్రాజిక— [ప్రవేశించి]

సీ॥ విలసిల్లు ననవద్య విద్యావిశేషంబు
శ్రీవిలాసము వింతచెలువు మిగులు;

మనస్సహంబైవెల్గు ద్యుమణి తేజముగల్గు;
లీలానుభూతి చలింపకుండు;
నరనాథసభల సన్మానంబు రెట్టించు;
గాఢ శాస్త్రీల్య సాకల్య మొప్పు;
లలిత శౌర్యౌదార్య లక్షణంబు లెసంగు;
హృదయవాక్యముల సత్త్వవసియుండు;
గీ॥ శత్రుజనరాజ్యలక్ష్మి చంచలత నొందు
దుర్ణయముఁ బాసి రాష్ట్రంబు తుష్టిఁజెందు
పేర్మి సిద్ధార్థి నిన్ను వరించియుండు;
సరస కరుణారసామృతాకర నరేంద్ర! ॥ 5

సుద—ఆర్యురాలా! నమస్కారము. ఈ యాసనము నధిష్ఠింపుము.

పరి— [కూర్చుండును].

సుద—భగవతీ! నీ వేయే పుణ్యక్షేత్రముల దర్శించుచు మాదేశంబును పావనం బొనర్చితివి?

పరి— కాశీ, గయా, ప్రయాగాది సకలపుణ్యక్షేత్రముల దర్శించి, ఉజ్జయినీ మహాకాళీ దర్శనార్థమై పోయియుంటిని.

సుద—ఓహో! ఉజ్జయినీనాథుఁ డగు భానుమంతుఁడు నాప్రియమిత్రుఁడే. ఆతఁడు సుఖంబున నున్నవాఁడా?

పరి— ఆతఁ డిప్పుడు తురుష్కదేశముపై దాడివెడలి యుండెను.

ఉ. సైరసులై చరించు నవనీపతు లెంతటి యుక్తియుక్త సం
చారమున న్మెలంగిన భుజాబలగర్వపటిష్ఠవృత్తి ని
ష్కారణవైర మూని తురకల్ వధియింపఁగ సార్వభౌముఁడ
త్యాదర మొప్పఁ బ్రోవఁ జనె నా బలహీన ధరాధినాథులన్॥ 6

సుద—అయ్యో! మీరు వెళ్ళినందుల కారాజేంద్రుఁడు లేకపోవుటచే నిరాదరణ మయ్యెఁ గాఁబోలు?

పరి—కలదుగదా విద్యున్మాల?

ఆ. తల్లిఁబోలె నతిథితతి నాదరమొనర్చు;
భృత్యజనుల కెల్లఁ బ్రేమఁ బెట్టు;
దయకుఁ బుట్టినిల్లు తాల్మిమై నిలసిల్లు;
రాజతనయ సుగుణరాజితనయ।

సుద—ఔను. భానుమంతున కొక తనూజాత కలదని వినియుంటిని. ఆమె యింతటి సుగుణమణియా?

పరి—తండ్రిని మరపించిన యాదరణ విశేషము కలది యగుటచే స్తోత్రపాత్రమైనది. మఱియు,

సీ. సేవకజనంబుఁ గరుణ రాజిల్లఁ బ్రోచు;
బంధువులనెల్లఁ గడు గౌరవమునఁ జూచు;
దేవ గురు విప్రసమితి భక్తిమెయిఁ గొలుచు;
నామె గుణరాశి; గృహలక్ష్మి యనఁగఁబోలును. 8

సుద—సౌశీల్యసాగరుఁడగు భానుమంతున కిట్టి కన్యారత్నంబు జనియించుట యొక వింతగాదు. రూపరియైనచో నద్దమునకుఁ గళాయివయిచినట్లుండును.

పరి—భూవరా! గుణసౌందర్యంబు లొకచోఁ గలసి యుండవను లోకోక్తి యీమెయెడ వమ్మయ్యెను.

చ॥ మొగము సుధాంశుఁబోలు, నఖముల్ నునుజుక్కలనేలు, మధ్యమున్
గగనము ధిక్కరించు, ఘనకైశిక మంబుదము న్హసించు, లే
నగవులు చంద్రికారుచి నణంచును, వాతెఱ సంజకెంజిగిం
దెగడి కలంచు, నట్టి సుదతీమణి ధాత్రికి నెందుఁ గల్గునే? 9

మఱియు,

మ॥ అల మందాకిని హేమపద్మముల నొయ్యారంబుప్పాడిం దీసి, యు
జ్వల పీయూషరసంబునం బదను హత్తంజేసి, సమ్మోద ని
ర్మల చిత్తంబున నల్వ చెల్వను సృజింపంబోలుఁ గాకున్న నీ
లలితాంగద్యుతి మాధురీ విభవముల్ గాన్పించునే కాంతలన్॥ 10

సుద—ఈమె యింతటి సౌందర్యవతియా? నేనెన్నఁడును వినియుండలేదు. ఆ లలితాంగి కెంత ప్రాయముండును?

పరి—సీ॥ అసమసాయకుని సారసబాణముల పోల్కి
కయనాంబుజములఁ దీక్ష్ణత జనించె;
కందర్పవిభుని చిల్కహుమాయి పోలిక
పలుకుల నమృతంబు లొలుకసాగె;
శారదపూర్ణిమాచంద్ర చంద్రికపోల్కి
మొగమున నెలనవ్వు మొలకలెత్తె;
రమణీయ మానసరాజహంసముపోల్కి
నడకల వింతమాంద్యము ఘటించె;
గీ॥ అవయవంబుల సౌత్మ్య మార్దవము వెలసె;
కౌను మున్పటికన్న సూక్ష్మత వహించె;
లలిత మధుమాసమున వనలక్ష్మిమాడ్కి
నవనవోన్మేషమున వింతనలువమీఱె॥ 11

సుద—[ఆత్మగతము] ఈ పరివ్రాజిక విద్యున్మాలాపువ్వొద్ఘాటన మొనర్చినది మొదలు నాహృదయం బేమొకో తత్తరపాటు వహించుచున్నది. [ప్రకాశము] అట్టి సౌందర్యరాశి యగు కన్య నెవ్వని యనుభవమునకై బ్రహ్మ నిర్మించెనో యెఱుంగుట దుర్లభముగదా !

పరి—[తనలో] ఓహో ! వీని నెమ్మనంబున విద్యున్మాలయం దనురాగబీజము నాటుకొనినది. ఇది కాలక్రమంబున వర్ధిల్లఁగలదు. [ప్రకాశము] రాజా ! నేను వచ్చి చాల తడవయినది. మాబోంట్లు విశేష మొకచో నుండుట యాశ్రమధర్మము కాదు. కావున నేను పోవలయును.

సుద—భగవతీ ! నీవు మరల నుజ్జయినీ మార్గమునకే వెళ్లెదవా ?

పరి—నే నచ్చటి యాత్ర పూర్తిగావించుకొనియే వచ్చితిని. నీ వుజ్జయినీ మహాకాళిని దర్శించి యిష్టసిద్ధి నొందఁగలవు. నేను పోయెదను.

సుద—చిత్తము.

పరి—[నిష్క్రమించును]

సుద—మంత్రిపుంగవా ! మన ప్రజల కష్టసుఖముల జాగరూకతతో విచారించుచుంటివా ?

విద్యు— వైపరీత్యములు సంభవించినప్పుడు తిన్నవారలోపాయము లొనర్చుచునే యుంటిని.

చ॥ క్రమముగ రాజ్యమందుఁగల కార్య, మితా, మిత, ఖడ్గ, వాదులన్
శమ, దమ, సాధనంబుల, వశంవదులం బొనరించి, మంత్రివ
ర్గము సముదారరీతి నొకరం బచరించితి, ద్రోహచిత్తుల
న్మితతగతిం జరింప, నిరసించితి, వారల దుష్ప్రవర్తనన్॥ 12

కంచుకి—[ప్రవేశించి] దేవా! మన రత్నపురీ నివాసు లొకకొందఱు ప్రభుదర్శనార్థము వచ్చియున్నారు.

సుద— లోనికి రప్పింపుము.

కంచు—[నిష్క్రమించును]

ప్రజలు- [ప్రవేశించి] దేవరా! జయము; జయము.

సుద—రత్నపురీ నివాసులారా! మీరెల్లరు నొక్కపారి వచ్చుటకుఁ గారణమేమి?

ప్రజ- [విచారముతో]

ప్రథ— సీ॥ వసురేయి నట్టి-టుఁ బడి నిద్రఁజొక్కంగ
నిలు గుల్లజేసి సొమ్ములు హరించె;
ద్వితీ— ఏటికేడాదికా నింటిగ్రాసంబెల్లఁ
గొల్లగాఁ బాతరల్ ద్రొల్లఁజేసె;
తృతీ— ఇలుదోమ వేళ మేనెల్ల మేల్కొని యార్వ
గడియలమోది తాల్గూడఁబువ్వ;
చతు— ఇంటిలో సొమ్మెల్ల నెచటదాచితి చెప్పు
మని వేడిచమురు మేనంతజల్లె;

ప్రథ— గీ॥ గోలపెట్టంగ మానోళ్ళ గుడ్డగ్రుక్కె;
ద్వితీ— భీతిఁబరవంగ తెక్కలు విరిచికట్టె;
తృతీ— వలదు వలదని నేనడ్డపడఁగ నన్ను
గంపత్రోడు గీడ్చిన ట్లీడ్చి కాలఁ దన్నె. 13

సుద—అక్కటా! మిమ్మిట్టి యిక్కట్టుల ముంచువాఁ డెవ్వడు?

ప్రజ—[విచారముతో] దేవా! ఏమిచెప్పుదుము. కరాళుఁ డను నొక బందిపోటు దొంగ మాపురంబుపయింబడి, అల్లకల్లోలము గావించి మమ్మట్టి దురవస్థల పాలు సేసె.

సుద—ఆహా! ఎన్నఁడును కష్టము లెఱుంగని మాకు నేఁడీ యాపద దుర్భరమే యగును.

ప్రజ—దేవర యాదురాత్ముని తాపుమాపకున్న మేమీయూరఁ గాపురము సేయఁ జాలము.

సుద—సచివోత్తమా!

క॥ దుష్టులు చెలరేగినచో
శిష్టులు సుఖజీవనంబుఁ జేయుట మిగులం
గష్టము; సాధుమృగంబులు
దుష్టమృగారణ్యమందు దోసఁగుం గనవే? 14

విద్యు—దేవరా!

గీ॥ క్షితిని దుష్టుల శిక్షించి శిష్టజనుల
దక్షతయొలర్ప రక్షించు ధర్మవిభుఁడ
వీవు వర్తింప లోకుల కేమిభయము?
బిడ్డలకుఁ దండ్రికడనుండ భీతిగలదె? 15

సుద—అట్లే.

విద్యు—ప్రజలారా! ఆకరాళుని బలం బెట్టిది? వాని సైన్యం బెంతయుండును?

ప్రజ—తొలుదొల్త వాదుష్టుండు పదిమంది చోరులతో బయలుదేరి పలువిధంబుల ధనార్జన మొనరించి క్రమక్రమముగ వందలకొలఁది సేవకుల జేర్చుకొని యిప్పుడీకోట పట్టణము నుద్వృత్తిగ నొక్కమారు ధ్వంసమొనర్పఁ గలుగునంతటి సైన్యముతోఁ దిరుగుచున్నాఁడు.

సుద—మంత్రీ! ఇట్టి దురాత్ములను ఖండించి ప్రజలను సౌఖ్య పెట్టుటయే మనపని గావున దీనికిం దగిన యాలోచన సేయుము.

విద్యు—దేవా! యిదియెంత.

ఉ॥ వానిబలమును మన సేనాని యొక్కఁడే
యుక్కడఁచుఁ గరాళిఁ ద్రొక్కఁ జెంత?
వడిఁ గుడిచిమ్మిగా వానికి గుడితల్పు
లక్షణములు గా వటుంట వినవె? 16

సుద—ఆ దుండగీఁ డిప్పు డేప్రాంతముల యందుఁ గ్రుమ్మరుచుండెనో?

ప్రజ—మహాప్రభూ! మాయూరు కొల్లగొనిన వెనుక నతఁడొకింత సైన్యమును గూర్చుకొని యుజ్జయినీ పరిసరారణ్యము నునికిగా నేర్పరచుకొనియుండె నని వినికి.

సుద—[తనలో] ఆహా!

మ॥ ఒకరన్ యోగిని కొల్వుకూటమున విద్యున్మాలసౌందర్య వ
ర్ణనముం జేసిన నాటనుండియును డెందం బా సతీరత్నముం
గనఁగా నువ్విళులూరుచున్నయది యింకన్నేను దత్సన్నిధిం
దనరం జేరిచి యాత్మఁగోడ ననుసంధానంబుఁ గావించెదన్॥ 17

కావున నీచోర సంహార కారణంబున నీకార్యంబుఁగూడ నెఱవేర్చుకొందును. [ప్రకాశము] మంత్రివరా! సంసిద్ధ వైరివీరాగ్రణుల నెదుర్కొనుట సుకరంబుగాని వంచకులగు మలిమ్లుచుల నెదుర్కొనుట కష్టతరము కావున.

తే॥ క్రూర పాటచ్చరానీక నారములను
బ్రాణహారిణిం బొనర్పఁ గృపాణపాణి
నగుచు నేగెద; నే వచ్చునంతదనుక
రాజ్యభారమ్ము నెడల జాగ్రత్తఁ గనుము॥ 18

విద్యా—చిత్తము.

సుద—ఒక సహస్రాశ్వదళముతో సరదారు నాయత్తపరుపుము.

విద్యా—దేవరయాజ్ఞ.

సుద—జానపదులారా! మీశ్రమల నివారించుటకై మేమేపోవుచుంటిమి. గావున మీరు నిర్భయముగ మీమీ నెలవులకుం బొండు.

ప్రజ—మహాప్రసాదము దేవా! [నిష్క్రమింతురు]

[తెరలో] వైతాళికులు—

మ॥ ఉరు తేజోవిభవంబుఁ జూపి, పరరాజోత్కర్షముం బాపి, త
త్స్ఫురసంఘోద్ధతి రూపుమాపు నల భాస్వంతుండు పెంపెక్క నం
బరమధ్యంబునఁ జండదీధితుల దీవ్యద్భంగి నిండించి, సం
గరమధ్యంబున నీవు బోలె వెలుఁగుం గాదే జగద్బాంధవా! 19

మద—మంత్రి! కాలసూచకు లగు వైతాళికులు మధ్యాహ్న సమయము నిరూపించుచున్నారు. కావున మన మీనాటికిఁ గొలువు చాలింతము.

విద్యా—చిత్తము, దేవా!

గీ॥ కొమరుమిగుల విద్యున్మాలఁ గూడి మెఱయు
ఘనుఁడు పోలిక జయలక్ష్మి నెనసి వచ్చు
యువనృపాగమ దివ్యమహోత్సవంబు
నెనుపుచూచుచు నుండుఁ డుర్వీంద్రులార! 20

[అందఱు నిష్క్రమింతురు]

ఇది ప్రథమాంకము.

---

శ్రీ

# విద్యాశాల

ప్రథమాంకము.

రంగము—ఉజ్జయినీ పరిసరారణ్యప్రాంతోద్యానము.

[ప్రవేశము—[సుదర్శనుండు, వేటకచెలికాడగు సునందుండు]

సునం—రాజా! మనసైనికులు నిన్నటి దిన మరణ్యమంతయుఁ దిరిగి తిరిగి వేసరినను దొంగలలో నొక్కఁడయినఁ గంటఁ బడలేదుగదా! కావున నీసమరసంరంభము వ్యర్థమనియే తలంచెదను. ఈ సునంతుని సత్కారమునకు మనమెట్లు పాత్రుల మయ్యెదము ?

సుద—వ్యర్థ మెట్లగును !

సునం—మనము వచ్చిన కార్యము వెనుకబట్టినది. మన మీ యడవులలోఁ జెట్టు పుట్టఁ బట్టుకొని తిరుగుచుంటిమి. వ్యర్థముగాక సార్థక మెట్లగును!

సుద—చెలికాడా! నీపరిజ్ఞాన మింతటిదేనా ? దొంగలఁ బట్టు టొక్కటియే మన కార్య మనుకొంటివా

సునం—కాకున్న మృగయావిహారివయి మాకిట్లు కనవసర శ్రమఁ గలిగింతువు అట్లయినఁ బగలు తిండికి, రాత్రి నిద్రకు మొగము వాచవలసినదియే. ఇది యథాశ్వైలుటయా ? యమశ్లోకములు సేయుటయా ?

సుద—అవును

చ॥ పొరుగున గూఢవైఖరిని బొంచి వసించుట, సమ్ముఖంబునం
బరువడి జిల్లిమాటలను వాలువలం బడవైచుకొంటయున్,
దొరకిన సంతసించుటయు, దుర్లభమైన విచారమొందుటల్,
దొరయుటఁ గాముకుల్ మృగయులుం సమధర్మమువార లేకదా !

సునం—రాజా! కాముకు లనుటచే నాకు సంశయము వొడముచున్నది. ఈమృగయా వినోదంబున

మ॥ హరిణీలోచన, సింహమధ్యను, బిసూనామోద, బింబాధరిం,
కరిణీగామినిఁ, గీరవాణిఁ, జమరీకాంతాలకం, బల్లవప్రా
త్కరపాణిన్, లతికాభుజన్, గిరికుచం, గాంతార కాంతామణిన్
మురువొప్పార వరించి నెమ్మనమున న్మోహంబున న్మున్నెదో ? 2

సున—మిత్రమా ! అట్లుగాదు.

సునం—కాకున్న నీ మృగారణ్యమున శ్రీకృష్ణునివగిది కొంచెతల నాఁటుతువా ? లేక మహేశ్వరునట్లు భిల్లపల్లవాధరల వరింతువా ?

సుద—సునందా ! నీజ్యోతిశ్శాస్త్ర విమర్శన మిప్పట్టున వమ్మయ్యెను.

సునం—రాజా ! నాజ్యోతిష మెప్పటికిని వమ్ముగానేరదు.

సీ॥ రమ్యశుద్ధాంత మీననేత్రలను జాసి
మిథునరాశిఁ బ్రవేశింప మేలుభంగి
సంతతారణ్య కన్యకా సంగమంబు
గలుగ కుండునె ? నీకు భూకాంతచంద్ర ! 3

సుద—సునందా ! నీవు రాశిపరిగణనంబునఁ గొంచెము పొరపడితివి.

ఆ॥ రాజచంద్రుఁ డెప్పు డారిసింహానుభోగ్యప
గతుఁడుగాక యెట్టి కరణినైన
మీనరాశినుండి మేషోప కన్యక
కెట్లు వచ్చు ? భావ్యమే తలంప। 4

సుత—రాజసింహమధ్య లనుచుంటివే ! ఏదో పెద్దకథయే పొసఁగుచున్నది కాఁబోలును, అట్లయిన నాకు మోదకములు దిట్టముగా దొరుకఁగలవు. నాపుణ్యము పుచ్చినది.

సుద—నీకెప్పుడును మోదకములమీఁదనే దృష్టి.

సునం—నాకు మోదకములమీఁదఁ బ్రేమయుండు, నీకు మోదకోపమకుచములమీఁదఁ బ్రేమ

దయు సహజమేకదా ! బ్రాహ్మణులు భోజనప్రియులుకారా !

సుద — మిత్రమా ! నీ హాస్యప్రసంగముల కేమిగాని, నాకొక రహస్య విషయమున నీవు తోడ్పడ వలయును.

సుశం — మాటవరుస కిట్లనుచుంటినే గాని నాకుఁదప్పునా ? నీవేమి చేయుమనినను జేయుచుండిన ముక్కోణమునఁ బెట్టి కొట్టింపఁగలవు. నీకోర్కె నెరవేర్చిన నన్నమాత్యునిఁగ జేసెదవా ?

సుద — ఉజ్జయినీనాథుఁడగు భానుమంతునకు విద్యున్మాలయను నొక పుత్రికారత్నము కలదఁట.

సుశం — అబ్బో ! రాజా ! నీతోఁగూడ మేఘమండలమువఱకు నెగురవలయును గాఁబోలును. మేఘమండలమునుండి క్రిందఁ బడితినా తుత్తునియలై పోదును. నాకుటుంబమున కుపకారవేతనమునైన నొసంగెదవా?

సుద — ఆమె రూపయౌవన లావణ్యాతిశయంబుల నొక పరివ్రాజిక మదయాస్థానమునఁ గరుదెంచి వేనోళ్ళనిట్లు శ్లాఘించినది.

మ॥ నునుకైమోడ్పి మెఱుంగు, వాల్గనుల కాంతుల్, చెక్కుటద్దంపుద
ళ్కును, ఫాలద్యుతి, దంతపఙ్క్తి బెళుకుల్, బాల్యాపి నాలేమయం
దొనరం గూడుట సార్థకాహ్వయము విద్యున్మాలనా నొప్పె ;న
వ్వనితాంతత్వము గోడ నో డొరులకున్ వాటిల్లునే పోల్కికల్॥ 5

సుశం — ఆమె యంతసౌందర్యరాశియా ? నీ వెప్పుడుఁ జూచితివి !

సుద — చూచినకంటె వేయిరెట్లెక్కుడుగ నామెప్రతిబింబము నామనంబున హత్తునటుల పరివ్రాజిక వర్ణించినది.

చ॥ పలుకులఁ సాధనంబులుగ బాల్పడ, శ్రోత్రుజనాంతరంగ భూ
స్థలుల విచిత్రితాకృతులఁ జక్కఁగ సృష్టికి మారుసృష్టి యి
మ్ముల నొనరించి లోకులఁ బ్రమోదపయోనిధి ముంచుటంగదా !
కలిగె ద్వితీయధాతలను ఖ్యాతి ధరిత్రిఁ గవీంద్రకోటికిన్॥ 6

సునం—ఎవ్వరో చెప్పినంతమాత్రముననే నీకామెయెడల నభిలాష కలిగినదా? మాటలం గోటల దాటింతుముగాని కాళ్ళు గడపలు దాటవు.

సుద— అభిలాష కలిగినదా యని యడుగుచుంటివా?

ఉ॥ ఆ తరుణీశిరోమణి ముఖాంబుజహాంబున గండుదేటినై
యా తనుగాత్రి మంజులతరాధరబింబమున న్శుకంబనై
యా తరళాక్షి యున్నతకుచాంతర మార్గమునం బ్రవాసినై
ప్రీతివహించు టెన్నండని వేడుక నుప్పొంగుచుండెదన్॥ 7

సునం—నీకంత తీవ్రసంకల్పము కలిగిన నేదియో యొకదారిం జూడక తప్పునా? ఇటుల నీ యుద్యానవనమున నెంత తిమ్మరిన నేమి ప్రయోజనము? నన్నలంకరించి యెద్దియే నొక మిషంబునం గోటలోనికిం బంపుము. పిట్టను వలలోం బడవేయు పన్నాగము నాలోచించెదను. కుయుక్తుల నన్ను మించువా డెవ్వండు?

సుద— మిత్రమా! ఆగు మాగుము. పండుగురివెంద చప్పరంబుల మాటున నుండి యెద్దియో ధ్వని వినవచ్చుచున్నది. చెట్టుచాటున నిశ్శబ్దముగా నుండి యెవ్వరో తెలిసికొందము. విద్యున్మాలగాని, యామె చెలికత్తెగాని యుద్యానంబునం దిమ్మరుట యసహజముగాదు.

సునం—రాజా! చీమ చిటుక్కుమన నెద్దియో స్త్రీల చప్పుడే యని యారాటపడెదవు. నాకును నెద్దియో వినవచ్చుచున్నది.

గీ॥ అరయ వెంకాయలోన నెల్కాడినట్లు,
కుండలో గచ్చకాయల నొలపగిది,
తప్పెలో మేకు లాడించు ధ్వనియుం బోలె,
గోతం గూలిన వాని గగ్గోలువలెను॥ 8

సుద— ఛీ! మూర్ఖుండా! సమయాసమయముల నెఱుంగక యెప్పుడు నొక్కరీతి నసంగత ప్రసంగములు గావించుచుందువు. సందడిసేయక యూరకుండుము.

[ చెట్లచాటుననుండి విద్యున్మాలా చతురికలు ప్రవేశించుచున్నారు ]

విద్యు— చూచితివా యీపున్నాగమును? చక్కని కొమ్మలతో నెట్లు విరాజిల్లుచున్నదో?

చతు— ఔను. పున్నాగములు కొమ్మలతోం గూడినపుడేగదా శోభను వహించుట?

సునం—ఓహో! రాజా! నీవ్రతము సువ్రతమైనది. అంతఃపురకాంత లుద్యానవనవిహారార్థ మరుదెంచుటయేగాక పున్నాగములు, కోయిలలు ననుచుండుటచే నీ సమావేశముం గూడఁ బ్రతీక్షించుచున్నట్లే తలంచెదను.

సుద— మిత్రమా! దానికేమిగాని వింటివా యామె కంఠమాధుర్యము. సప్తస్వరముల మేళవించి సరస్వతీదేవి వీణవాయించుచున్నదో యనునట్లు వీనులకు విందు సేయుచున్నది.

సునం—మిత్రుఁడా! సప్తస్వరములనుచుంటివిగదా! అవి యెవ్వి? యెట్లుండును?

సుద— సీ॥ షడ్జంబు బ్రాహ్మణస్వరము పోలికనుండు;
ఋషభంబు గోధ్వని నెనఁగియుండు;
అల్లగాంధార మజావి కంఠముఁబోలు;
రహిమధ్యమము క్రౌంచరవముఁబోలు;
పంచమస్వరమది పరభృతధ్వనిఁబోలు;
ధైవతం బశ్వశబ్దంబుఁబోలు;
ఘననిషాదంబది గంధసింధుర బృంహి
తంబుపోలిక మీఱఁ దనరియుండు;

సునం— గీ॥ ఆద్దిరా! గుఱ్ఱములు, గొఱ్ఱె లరచినట్లు,
గోవులును, మేక, లేన్గులుఁ గూసినట్లు
లుండునే సప్తరవముల యొప్పిదంబు?
గార్ధభం బొందు తక్కు వీ గణమునందు॥ 9

సుద— అహా! నీసంగీతజ్ఞాన మంతయుఁ జక్కఁగా వెల్లడించితివి. సప్తస్వరంబులు నీజంతుధ్వనులఁ బోలియుండునని యెఱుంగవు గాఁబోలును.

సునం—సప్తస్వరవిధానము నాకుఁ దెలియదుగాని నేను సామవేది నగుటచే నాప్రక్రియ మాతాతగారు మానాయనగారికిని, మాతండ్రిగారు నాకును, ఉగ్గుబాలతో నూరి పోసియున్నారు.

విద్యు—[కొంచెము ముందు పరిక్రమించుచు] చెలీ! నేనాడు ప్రతివాక్యమునకును విపరీతార్థములే కల్పించుచుందువు.

సుద— ఆహాహా! మిత్రమా! చూచితివా? పరివ్రాజిక యెచ్చున గ్రుద్దినట్లు వర్ణించినది.

ఉ॥ ఆ నగుమోము చక్కఁదన, మా కనుదమ్ముల మేటిమెప్పిదం,
బా నునుమోవి కెంపుజిగి, యా భుజవల్లుల సోయగంబు, నా
మేని నిగారపుం దళుకు, మిక్కుటమై మిఱుమిట్లుగొల్పు ; నో
హో ! నవయౌవనాంగి, వికచోత్పల సాయకు మోహనాస్త్రమో॥

సునం— భోజన పదార్థములఁ జూచునప్పటి యానంద మీ చిన్నదానిం జూచిన నాకుఁ గలుగుటలేదు.

చతు— ఇందు విపరీత మేమున్నది? సఖీ! అది ప్రకృతిసామాన్యమును నీప్రియుని విషయమున రూక్షమున్నై యున్నది.

సుద— అహో ! ఏమి! క్రీడించుచున్నది. ఈమె దృష్టి యెవ్వనిమీఁద నున్నదో కదా !

ఉ॥ ఈసతి హాసచంద్రికల కేపురుషుండు చకోరమౌనొకో ?
యీ సుమగంధి బాహులత లేఖను గాఢగతిం బెనంగునో ?
యీ సఖి యాననాబ్జమున కేసరసుం డళిపోతమౌనో ? హా!
యీసరసాంగి చేపడిన నేటికి యచ్చరబోటి కూటముల్॥ 11

సునం—పరకాయప్రవేశమున నిరూపాంతరముల నీవే ధరింపఁగలవు. ఆమె యందుల కియ్యకొనదేని కలదుగదా రాక్షసప్రక్రియ.

సుద— ఓరి జల్పాకా ! ఆమె యెద్దియో పల్కుచున్నది విననిమ్ము. శుష్కోపన్యాసముల నిచ్చోటలో ఘటికుడవు.

విద్యు—సఖీ ! ప్రియనామోచ్చారణంబున నాడెందముం దిరిగి కొందలపరచుచుంటివి.

ఉ॥ ఆ నవమోహనాంగుఁ గనినప్పటినుండియు నామనంబునన్
మానఁగరాని వేదన క్రమంబుగ హెచ్చి కలంచుచుండెఁ; న
మ్మానవనాథమౌళి నను మన్ననసేయుట కల్ల; యెన్నఁడీ
దీనత బాయు నాకు? నను దేర్చెడు దిక్కెవరింకఁ జెల్లరే! 12

సుద— అహో ! యేమి యీమె యనురాగప్రకటనము! స్వచ్ఛదర్పణంబువలెఁ బ్రకాశించుచున్నది.

సునం—చెలికాఁడా ! కాముకుల హృదయదర్పణమున కెదురుగ నెట్టి పాత్ర నుంచిన దానినే పూర్తిగ నాకర్షించును. ఆకలిగొనినపుడు నావక్త్రము తన కేది లభిం

చిన దానినే గ్రహించును.

చతు—చెలీ! యీ బాలసహకార ప్రాంతమున విశ్రమింతము రమ్ము.

విద్యు—ఈబాలను సహకార ప్రాంతము కూడ లభించునా?

ఉ॥ ఆతరుణీసుమూర్తి మధురాధర శర్కర నానఁగట్టి నా
హా తెలజయేల? యామనుజవల్లభు కౌఁగిటఁ జిక్కనట్టి నా
యీ తనువేల? యా వసుమతీశ్వరుఁ జెందని నాకు జన్మమే
లా? తలపోయ నన్నియు వసాంతర సంగత చంద్రికల్ గదా॥ 13

సుద—సత్యముగా నీమె వెన్నెలయే.

కం॥ కో నవఁగఁబోలు గగనము
పై నెగడెను వదనచంద్రు వలన విశాలం
బైన కలికి చూడ్కులచే
లేనగవుల నీమె వెన్నెలే యనఁ బోలిసెన్॥ 14

సుకం—మిత్రమా! సహకార శరత్కాలమువు నీవుండ నదమిఁ గాచిన వెన్నెలనైతినని యామె యేల భ్రమపడుచుండెనో?

సుద—ఆమె నిజముగా భ్రమనే జెందుచున్నది.

చతు—చెలీ! నీవింత విరాళిఁ జెందనేల? నీ సౌందర్యకథనమువలననే చంచల హృదయుఁడగు నప్రియుండు నిన్నన్వేషించుచు నేదో రాక తడయునా? ఇంతలోనే నేల బేలవయ్యెదవు!

సుద—అది యట్లే, పరివ్రాజికయొక్క వర్ణనావిశేషమువలన నేనింతదూర మాకర్షింపఁబడితిని. చతుస్సంయోగమైనతోడనే-

ఉ॥ ఆమె ముఖేందు దర్శనమునందె మదీయ మనంబు చంద్రికాం
తోపలతుల్యమై కరఁగె; నుగ్గలి ఫేక్షణ చుంబకాశ్మపుం
దాపున నున్మనంబనఁ దనర్చు నయఃఫలకంబు మాటికిం
దోఁపడి యీడ్వఁగాఁ బడియె; దుస్సహ మోహ వికారమగ్నత॥ 15

సుమం—రాజా! మారమునను న్న దారపుత్రాదులే నన్నాకర్షించుచుండ, సమీపమున నున్న యీమె నిన్నాకర్షించుట యొక్క వింతలోనిది కాదు. శ్రోతులభోక్తలను సల్లంగడు నిట్లే యాకర్షించుచుండును.

విద్యు— చ॥ శుక పిక శారికాదులనఁ జొప్పడు మర్త్యుల సేనఁ జేర్చి, య
ల్పకుసుమ పల్లవ ప్రకర బాణముల న్సమకూర్చి, పేర్చి, కొం
చక యబలాళి నేచు నల జాల్మునకుం గుసుమాయుధుండు, ద
ర్పకుఁడును, మన్మథుండను ప్రభావము జూడఁగ నేతిబీరయే॥ 16

సుద— సుందరీ! ఈవిషయమునఁ గేవల మనృతమాడుచుంటివి సుమా!

మ॥ అధరాశోకము, లోచనోత్పలము, వక్త్రాబ్జంబు, దంతావళీ
ప్రథితోద్యన్నవమల్లికల్, శరములై; బాహుద్వయోల్లాస మి
క్షుధనుర్దండము, పల్కు కీరహయముల్, శుంభచ్ఛిరోజంబులన్
మధుపజ్యాళిగ నిచ్చి, చిత్తజునకుం బ్రాపై ననుస్వేచవే॥ 17

సునం— స్నేహితుఁడా! నీకును మతిపోవుచున్నట్లున్నది. ఎన్నఁడో హరకోపానలంబున భస్మమైన మన్మథుఁడు పిశాచమై వచ్చి నిన్నావరించెనా? స్వప్నావస్థయఁ దుంటివా?

సుద— మిత్రమా! ఆతని దేహము నశించినను మనోజుఁ డగుటచేఁ దలఁచుకొనినపుడెల్లఁ బుట్టుచుండును.

చతు— చెలీ! నీకు మారుఁడిపుడు సంతాపకారకుఁడుగా నున్నను ప్రియసందర్శనంబున సంతాప నివారకుఁడు కాఁగలఁడు.

విద్యు— చెలీ! నీవెప్పుడును నన్ను శుష్కప్రియములచేతనె సంతోషపెట్టుచుంటివి.

చ॥ జనకునితోడ యాత్రల వశంబున నేటికిఁబోతి? బోతిఁబో
యినవరు నాతిథేయ మతఁ డేల గ్రహించె? గ్రహించెఁబో, వరే
శుని నపు డేలచూచితిని? చూచితిఁబో, మది వాని సోయగం
బునకుఁ గరంగ నేల? విధిపోకడ లెన్న బలీయముల్గదా! 18

చతు— నేను శుష్కప్రియాలాపను గాను. నీవు గుణకథనంబుఁ గావించుచుండ నాతం డుత్సాహపూరితుండై నీ సౌందర్యవర్ణన మాకాంక్షించెను. నీ సౌందర్యమును వర్ణించుచుండ వాని నెమ్మనం బడుగడుగునకు నుప్పొంగుచుండుటచే నాతని మనోవైకల్యంబు విస్పష్టమయ్యెను.

సుద— ఏమిది విద్యున్మాలయా, నామె తండ్రితోడ వెనుక యాత్రార్థ మేగుచు మా యింట నొకనాఁడు విడిసిరి. కావున నీమె నన్నే తలఁచియుండదుగదా! నేనప్పుడామెను జూడ వలనుపడినదికాదు.

సునం—అట్లయిన మన ముభయులమును కృతార్థులమే. నేనును వివాహసందర్భమున జరుగు వేడుకలయందు-

చ॥ కలయఁగ నృత్యలీలలను గన్నుల, గీతములందు వీనులన్,
నలువగు గంధ ధూపముల నాసిక, బంధుర భక్ష్యభోజ్యమం
డలముల నాల్కఁ, జందనమునన్ సఖిలాంగము లుల్లసిల్లఁ బెం
పలరఁగ నాదు నింద్రియము లైదిటి ధన్యత నొందఁజేసెదన్॥ 19

విద్యు—చతురికా! నీవు నన్నెంత యూరార్చినను నేనీ విరహభారమును వహింపఁజాల. చూడుము-

సీ॥ శుక పిక శారికాదిక పక్షికలకలం
బులకు నాచెవులు వ్రక్కలగుచుండె;
కుసుమ పల్లవ లతావిసరము ల్గనలేక
కన్నులు కాయలు గాచుచుండె;
సకల గంధపరాగ నికరముల్ ఘ్రాణించి
యెంతయు ముక్కుపుటం బెండుచుండె;
మలయ భూమీధర నిలయానిలంబుల
మలమల నొడలెల్ల మాడుచుండె;
ఆ॥ ఉష్ణనయనుబోలె నుష్ణాంగు చంద్రికా
జలధిపూర మింక నైచు టెట్లొ?
దీని జేర్చి నన్ను గరుణతో రక్షించు
భార మెల్ల నీది ప్రాణసఖిరో! 20

చతు—చెలీ! మారసైన్యముచేఁ గోలాహలము సేయఁబడు నీతాపు నీకు బాధాకరముగనున్నచోఁ గొండొకచోటికిం బోయి విశ్రమింతము రమ్ము. [పరిక్రమింతురు]

సుమ—మిత్రమా! మనోహారిణి నిక్కముగ మన్మథావస్థచే నవసియున్నది.

సీ॥ తనువల్లి కేతకీదళ పాండిమముఁబూని
పసఁదక్కి వెలవెల బాఱియుండె;
కనుదోయి పుండరీకచ్ఛాయఁ గోల్పోయి
హల్లకద్యుతుల రాజిల్లుచుండె;

ఉష్ణనిశ్వాస వాయుప్రసారంబుచేఁ
దాని కెమ్మోవి యెంతయును గందె;
కడుఁగొని జాల్వారు కన్నీటికాల్వలఁ
జెక్కుటద్దంబుల జిగిదొరంగె;
సీ॥ ఒడలు పులకించెఁ బూచిన కడిమిపోల్కి;
చెమ్మటలు గ్రమ్మెఁ దుహినకణమ్ము లట్టుల;
సకలభోగంబులందు ద్వేషంబు వొడమెఁ;
గట్టికత్తె! చెలి వంత మిక్కుటముగాదె? 21

సునం— రాజా! పాపమా చెలికత్తె యెంతకృశించియున్నదో! ఏలికల విరహావస్థ సేవకులకు దురవస్థగాఁ బరిణమించుచున్నది. నీకొఱకు నేనెట్లు నవయుచుంటినో యామెకొఱకుఁ జతురిక యుం నట్లే నవయుచున్నది. "రాజపాపం పురోహితః" అను మాట వ్యర్థమగునా?

చతు— నెచ్చెలీ! చూచితివా? ప్రియురాలి నెదుటఁబెట్టుకొని బర్హమును విప్పి బర్హిణ మెట్లు నృత్యము సేయుచున్నదో!

విద్యు— చతురికా! నాకు నిట్టి భాగ్య మెన్నఁడు సమకూరునోగదా!

సునం— విద్యున్మాలా దర్శనంబున మారాజ బర్హిణము నృత్యము సేయుచునే యున్నది. కన్నులు విప్పి చూచు భాగ్యము నీ కింకను లభింపలేదు.

సుద— మిత్రమా! ఆమె నన్నను గ్రహించినయెడల నృత్యము సేయుటయేగాదు-

సీ॥ త్రొక్కను గౌఁగిలి నెపమున నొడలుపట్టి
మెఱుఁగుఁ జెక్కుల మకరిచిత్తరువు వ్రాసి
యధరసుధరూప మొప్పు నాహార మొసఁగి
సకలసేవ లొనర్తు నాజలజముఖికి॥ 22

సునం— వేలకొలఁది స్త్రీజనంబు నెడలఁ గాముకు లిట్లే యాసఁ గొల్పి తుదకుఁ జేఁజిక్కిన తోడనే-

ఆ॥ పండ్లు గోడఁ గొట్టికి, పలుగోళ్ళ బట్టికియు
జుట్టులాగి చేలఁ జుట్టియూఁగి

నెఱయొకింత లేక పెనచి పీడింతురు;
కాముకులకు నీతి గలదె జగతి ? 23

సుద — ఛీ! మూర్ఖుఁడా! నీ వెప్పుడు వికటావికటములే పల్కుచుందువు.

చతు — చెలీ! ఇది యేమిపాపము. నీమనస్సును మరలించుటకు నే నెద్దానిని జూపించిన నద్దానినే భ్రమరకీటన్యాయమున విరహావస్థగా నే మార్చుకొనుచుంటివి.

విద్యు — ఈ నిరర్థక జీవితమును దుర్భరముగా నెంతకాలము గడపుదును!

సీ॥ ప్రేమ హారము జేసి బిగిసి నా మెడ కురి
త్రాళ్ళుగందు లతామతల్లులార!
కృపమాలి విషభావ మొనసి జీవముఁ గొందు
రాజీవమకరంద రసములార!
కరుణవీడి ద్రొక్కి యధోగతికిఁ జేర్పుఁ డగాధ
కూపంబులై కీలాకూళులార!
మక్కువ విడి ముక్క ముక్కలుగాఁ గోయు
క్రకచములగుదు కేతకములార!

గీ॥ సుందరీ సుందరుల నాత్మఁ జొక్కఁజేసి
నూత్నరాగంబుఁ బెంచు బంధువులు మీరు;
దుస్సహంబైన వలవంతఁ దూలియున్న
నన్ను శిక్షించు టిది మీకు న్యాయమగునె? 24

హా! కాశ్మీరాధినాథా! సుదర్శనా! యెంతకష్టమును దెచ్చిపెట్టితివి?
[మూర్ఛిల్లును]

మన — మిత్రమా! విద్యున్మాల నిన్నే పిలుచుచున్నది. నీపుణ్యము పుచ్చినది.

సుద — నీవనినట్లు నేను ధన్యుఁడనే. కాని-

క॥ ఈ మెలఁత నన్ను గోరుట
కామోదము, పూర్ణముని గనని కొందలముల్
నా మనమునఁ బెనఁగొనెఁ దో
స్తో మెఱుఁగును నుఱుము మింటఁ దోఁచినభంగిన్॥ 25

ఇందుల కేమిసేయుదును?

సునం—చేయుట కేమున్నది. శీఘ్రముగఁ జెంత కేగి కరస్పర్శమున నామె నామంత్రించితివేని యామె నావహించిన మారవికారోద్ఘాత మణఁగును.

కం॥ నీయనురాగజ్ఞానం
బా యతివకుఁ గల్గ మిథ్యయగా జగమికి యుం
బాయువడ విరహవేదన
హాయిగ బ్రహ్మానుభవసుఖాంబుధి మునుఁగున్! 26

సుద— మిత్రమా! మంచిమాటఁ జెప్పితివి. అట్లే చేసెదను. నీవుఁగూడ నావెనువెంట నేతెమ్ము. [సమీపించి విద్యున్మాల శిరస్సు నంకమునఁ జేర్చుకొని తామరాకుచే విసరుచు]

మ॥ అనురాగంబున నెవ్వనిం గుఱిచి సదాహారము ల్మానితో
తనరన్నీదు మనోధనం బెవనికిన్ దత్తంబు గావించితో
తనివిం బ్రేమసుధారసం బెవనిమీఁదం బాఱఁగాఁ జేసితో
వనితా! వాఁడితఁడే ముదంబునను సేవల్సేయు దాసుండుసూ! 27

విద్యు—[కనులు దెఱచి చూచి, తత్తరతో లేచి, శృంగారలజ్జ నభినయించుచుఁ దనలో] ఆహా! ఏమి నామనోవల్లభుఁడే యిచ్చటి కరుదెంచెనే! ఈతని సమావేశమునకై నామనం బెంత పరితపించెనో యిప్పు డంతె లజ్జించుచున్నది. [ప్రకాశము] సఖీ! చతురికా! నేనిపు డిచ్చట విశ్రమింప నింతలో నెవరో మహాపురుషు లరుదెంచిరి. కావున మనమిచ్చట నుండఁ జనదు. అంతఃపురమున కరుగుదము రమ్ము.

చతు—సఖీ! నీవు విశ్రమింపలేదు. మోహపరివేదనచే దోదూయమాన మానసవై మూర్ఛనంద మనపాలిటి దైవమువలె నితఁ డాకస్మికముగ నరుదెంచి నిన్ను బునర్జీవితఁ గావించెను. కావున నీ వీతని మనోభీష్టసిద్ధి యగునట్లు సత్కరించిగాని వెడలుట ధర్మముగాదు.

సుద—ఉ॥ సుందరి నీకు మేల్పడి ప్రసూనశరార్తిఁ గలంగి నెమ్మదిం
గందుచు నెప్పుడింకఁ గలుగు న్నినుఁజూచెడి భాగ్యమంచు లో

చతు— [నవ్వి] రాజచంద్రమా! పరివ్రాజిక నిన్నేమి యాశీర్వదించెనో చెప్పఁగోఁదునా?

సుద—ఏది నీకంత దివ్యజ్ఞాన ముండిన జెప్పు చూతము.

చతు— సీ॥ విలసిల్లు ననవద్య విద్యావిశేషంబు,
కైలాసమును మించు చెలువమునను
సుస్పష్టమై వెల్గు దివ్యమౌ తేజము గల్గు
శీలానుభూతి చలింపకుండు
నరనాథసభల సన్మానంబు రెట్టించు
గాఢసౌశీల్యసాకల్య మొప్పు
లలిత శౌర్యౌదార్య లక్షణంబు లెసంగు
హృదయవాక్యముల సత్త్వనసియుండు
గీ॥ శత్రుజనరాజ్యలక్ష్మి చంచలతనొందు;
దుర్నయముఁ బాసి రాష్ట్రంబు తుష్టిఁజెందుఁ
క్షేమసిద్ధాత్రి నిన్ను వరించియుండు;
సరసకరుణారసామృతాకర నరేంద్ర! 33

సుమం—[తనలో] సాహచర్యమున నిది నాతలను దన్నినదిగనున్నదే?

సుద—[విని యాశ్చర్యముతో స్వగతము] ఏమిది! ఒకయక్షరమైనఁ దప్పకుండ నాటి పద్యము నీమె యెట్లు చదువఁ గలిగెను? [ప్రకాశ] చతురికా! నీకు దూరశ్రవణ ప్రజ్ఞ కూడఁ గలదా?

విద్యు—ప్రాణవల్లభా! ఈ మాచెలికి దూరశ్రవణప్రజ్ఞయే కాదు. ఇంకను జాల ప్రజ్ఞలు కలవు.

సుద—[నివ్వెరతో సంశయించుచుండెను]

చతు—ఆపద్యమెల్ల దేవరవారు చక్కఁగఁ బరిశీలించితిరా?

సుద—పరిశీలించుటకేమున్నది? ఆశీరర్థకమై విరాజిల్లుచున్నది.

చతు—దేవర యాపద్యమును బూర్తిగ విమర్శించినయెడలఁ బరివ్రాజిక యెవ్వరో తెలియఁగలదు.

సుమం—తిమ్మని బ్రహ్మని బ్రహ్మని తిమ్మని జేయఁగల మాయావిగనున్నదే!

సుద—ఈ ప్రసంగము నాకుఁ గేవల మగమ్యముగానున్నది. పద్యవిమర్శమున కర్థకాఠిన్యముగాని, భావకాఠిన్యముగాని గాన్పింపదే!

విద్యు—నాథా! ఆసీసగీతముల యతిస్థానాక్షరంబులఁ పాదక్రమంబున యథాస్థితంబుగ సందర్శించినచో సర్వము విదితముగాఁగలదు.

సుద— [పద్యమును దిరిగి విమర్శించి నివ్వెరపోయి నవ్వుచు] నీయతివేషహాస్యము గ యతిస్థానమున దాచుకొంటివా? మేలు!

విద్యు—చతు—[నవ్వుచున్నారు]

సుద— చతురికా! నీకు భగవంతుఁడు తగిన నామము సమకూర్చెను. అపుడు కేవల యోగినివలె భక్తివిశ్వాసములఁ గలిగించితివి. అట్లననేల? నీవు నిజముగా యోగినివే.

క॥ మించి వియోగంబునఁ గృశి
యించిన దంపతుల యోగ మొనరించుటచేఁ
గాంచక యోగినివంచు వ
మాంచిత నామంబుఁగంటి సార్థకఫలశోభిన్ ॥ 34

సునం—చతురికా! మీయమ్మగారి స్నేహముఁజేసి నీవు యోగినివైతివి. మాయయ్యగారి స్నేహముఁజేసి కాదవ్వులఁదిరుగుచు నేను యోగినైతిని. కాని వారిరువురి నంతఃపురభోగంబుల ననుభవింపఁ బంపి మనమిరువురము తేఁచిపోదము రమ్ము. కార్యాంతే విసర్జయేత్ అనెదరు. ఇట్టి తరుణములనే మనమేలును మనము చూచుకొనవలెను.

చతు— ఛీ! మూఢుఁడా! నీయూహలు చాలదూరము లాగుచున్నవి. నీవికట ప్రసంగమింతటితోఁ గట్టిపెట్టుము.

సునం—రాజా! నీవంతఃపురమునకుండు కాలమునం దేడుగడియలు నీయధికారమును నాకొసంగిన సకలమును జక్కఁబెట్టెదను.

సుద— ప్రేయసీ! సాయంసమయ మగుచున్నది.

మ॥ కమలంబుల్ ముకుళింపఁ బాల్పడియె; దిక్చక్రంబు నల్లాంధకా
రము గ్రమ్మెన్; గగనాంగణంబునను దారల్ చయ్యనం దోఁచెఁ; నీ
డములం జేరఁగఁ బాఱెఁ బక్షితతి; వేడ్కన్ల్మేలుఁగా ధేనుసం
ఘము గోష్ఠంబులఁ జేరవచ్చెఁ జక్రోకల్ క్రేపులల్లాడ్పఁగన్ ॥

జార చోరాలయంబగు నీవనప్రాంతమున నబలలు సంచరింపఁ దగదు. కావున యథాస్థానములకుఁ బోవుదము.

చతు— దేవా! అట్లేచేయుదము. [అందఱు నిష్క్రమింతురు]

ఇది ద్వితీయాంకము.

---

శ్రీ

# విద్యున్మాల

## తృతీయాంకము.

### విష్కంభము.

[ఇద్దఱు దొంగలు ప్రవేశించుచున్నారు.]

ప్రథ— అన్నా! నేను నాలుగు దినంబులనుండియుఁ మారువేసంబునఁ గోటలోనుండి యెంత ప్రయత్నించినను కోటకవాటములు తెరిపింప వీలు కలిగినదికాదు. నీవిట్లు లోని కెట్లువచ్చితివి?

ద్వితీ— తమ్ముఁడా! నీకింకను తెలియనే లేదా? మన గుంపంతయు రెండుమూఁడు రాత్రులు నిద్రలేక బహిర్ద్వారముకడ వేచియుండినను లోనఁ బ్రవేశించుటకు వీలుచిక్కినదికాదు. నేటికి మనయదృష్టము పండినది.

ప్రథ— ఏమిజరిగినదో చెప్పుము. నాకు వినఁ గుతూహలముగానున్నది

ద్వితీ— ఈరాత్రి కొంచెము మాటుమణఁగినతోడనే రాజకుమారి పరిచారిక యెవనినో యొక పురుషుని వెంటఁబెట్టుకొని మార్గమునుండి వచ్చినది.

ప్రథ— ఏమి? యీవిచరిత్రము చిత్రముగానున్నదే. ఇదియేదియో యంతఃపుర రహస్యమై యుండవచ్చును. తరువాత నేమి జరిగెను?

ద్వితీ— వారు సింహద్వారమును సమీపించుచుండ వారికనుమానము గలుగకుండ మేము మందిరమును గందకము నంటియున్న పొదలలో డాఁగియుంటిమి.

ప్రథ— మంచి యెత్తే వేసితిరి. మీరు కాన్పించిన వారు సమీపింపకయే పోదురేమో?

ద్వితీ— అంత నామె మూఁడుసారు లొక చిత్రవిధంబున నిలవైవఁ గోటతలుపులు తటాలునఁ దెరువఁబడినవి. ఆమె కడు నేర్పుగలది.

ప్రథ— అప్పుడు మీరేమి చేసితిరి?

ద్వితీ— ఆ స్త్రీపురుషుల నిరువురను మెల్లగ లోనికిఁ బోనిచ్చి మేము పిల్లిపొంచి యెలుకపై దుముకునట్లు వ్యూత్తుగఁ గావలివాండ్రపైఁ బడి నోట గుడ్డలు గ్రుక్కి కిక్కురు మనకుండఁ గాలు సేతులు బంధించితిమి.

ప్రథ— మేలు మేలు. ఆపైన—

ద్వితీ— ఆపైన నేమున్నది. గండిపడిన చెఱువునీరంతయు బయటఁ బ్రవహించునట్లు మనవారందఱు లోనఁ బ్రవేశించిరి.

ప్రథ— ఆ చెలికత్తె తల్లి కడుపు చల్లఁగా మన కడుపులోని చల్లకదులకుండఁ గార్యసిద్ధి లభించినది.

ద్వితీ—కోటకుఁ దూర్పువైపునఁగల యొడారిలో మననాయకుఁడగు కరాళుని కుడారము పాతితిమి. అతఁ డందు సుఖోపవిష్టుండయ్యెను.

ప్రథ—అట్లయిన నేటిరాత్రి మనకు దోపిడి యేమియు దొరకనే దొరకదా?

ద్వితీ—దొరక కేమి? మన నాయకుఁడంత వెఱ్ఱివాఁడనుకొంటివా? తాను కుడారమునఁ గూర్చుండి దండునంతను గోటమీఁది కెగవిడిచెను.

ప్రథ—అట్లయిన నలుగురితోపాటు మనకును నేదియో కొంత లబ్ధికలుగును. ఆలసింపక పోవుదముపద. [ఇరువురు నిష్క్రమింతురు.]

రంగము—దొంగల కధిపతియగు కరాళుని సభ.

[కరాళుఁడు, అతని కాప్తుఁడు నికుంభుఁడును ప్రవేశింతురు.]

కరా—మిత్రమా! భానుమంతుఁడు సేనాసమేతుండుగాఁ బరరాష్ట్రముపై దాడివెడలిన సంగతి వినిపట్టి మనము మన ప్రతాపము నుజ్జయినిపైఁ జూపుటకు సమకట్టి వచ్చినందులకు, అవలీలగాఁ బ్రాసాద రక్షక సైన్యమును బరిమార్చి కోటలోఁ బ్రవేశింపఁ గలుగుట శుభసూచకమే సుమా!

నికుం—నాయకుఁడా! అందులకు సందేహమేమి? నీ విప్పుడును, అమోఘ సంకల్పుఁడవు నీప్రతాపము వెన్న వేయి నోళ్లుగల యాదిశేషునకైన నలవిగాదు. మనుష్యమాత్రుండ నాకు వశమగునా?

సీ॥ కోటదుర్గము లీవు కుప్పించి దాటించ
మేఘనాదునిబోలె మెలఁగఁగలవు;
గొబ్బుగొబ్బున నీవు బొబ్బరించితివేని
పరిశయాంబుదము భాతిఁ బరఁగఁగలవు;
పరిజ్వలాగ్నిజ్వాల భవనముల్గాల్చుచో
నాంజనేయునిభంగి నలరఁగలవు;
నగరకవాటము ల్పగులఁగొట్టితివేని,
అలఘటోత్కచుపోల్కి వెలయఁగలవు;
గీ॥ సకల భూమండలంబునఁ జక్కనైన
రత్నముల, మేటి కన్యకారత్నములను
గొల్లగాఁగొని చెఱపట్టి కొన్న వేళ
రావణుం బోలఁగలవు కరాళ! నీవు॥

కరా—మిత్రమా! యిప్పట్టున మనకు కలయునంత ద్రవ్యము చేపడుటలో సందియ మేమియులేదు. కాని—

చ॥ కలదంట రాజపుత్రిక, యల కాముని పట్టపుదంతి, చక్కనౌ
వలపుల పూలబంతి, చెలువంపు గుణంబుల మేలుకాంతి, ము
ద్దులరతి చేతిబంతి, లలిదొత్కు సు శిల్పాల మేలుబంతి, మి
క్కిలి రవళించు పల్కుచెలికిన్నెర నీణెయతంతి యంతిసూ! 2

ఆట్టి కన్యాలలామముగూడ నాకుం గరగతంబయ్యెనేని నాజన్మము నేటితో సార్థకమగును.

నికుం—ఏమి? ఆమె యంత సౌందర్యవతియా?

కరా—నీవైఖరిం జూడ నీకుం గూడ నామెపై యాస పొడమినట్లున్నది వ్యర్థాపేక్ష పెట్టుకొనకుము. దీనివలన మన స్నేహమునకు నైకమత్యమునకు ననర్థము రాంగలదు. నాకామె లభించిన నీకు దంతపుపైసర్వాధికార మొసంగెదను లే.

నికుం—కరాళుండా! నీవెప్పుడు నట్టి యనుమానముం బెట్టుకొనకుము. నేను కేవలము డబ్బువాండనే గాని యిట్టి పిచ్చివేషములతో నాకు నిమిత్తములేదు. కన్యాహరణమునకై నీకృషి యేమి? భానుమంతుండు నీ సౌందర్యమున కామోదించునా?

కరా—మనవాండ్రను రాజమందిరమునకుం బంపునపుడు ధనధాన్యాదికములం గొల్ల గొనిన వెనుక రాజపుత్రికనుగూడ బంధించి తెండని నియమించియుంటిని బలాత్కారముగ నాకర్షింపవలసినదే. భానుమంతుని లెక్క మనకేమి?

నికుం—అట్లయిన మనవాండ్రు ప్రమత్తులై యుండరు. యువతీజన మంతఃపురమున నుండక యేమయ్యెదరు? కావున నీరాత్రి నీకోర్కెం బడసిన దనియే తలంపవచ్చును. కాని యాచెలికత్తె జిత్తులమారిది. దాని సమర్థించుట దుర్లభము.

కరా—మన భటులింకను దిరిగి రాకుండుటకుం గారణ మేమో తెలియరాకున్నది. రాజమందిరమును గొల్లగొనుట కింతయాలస్యము కావలసిన పనిలేదు. చెలికత్తెను నిర్బంధమే తగినమందు.

నికుం—మిత్రమా! నీవు వలపుదగిలియున్న వాండవగుటచేం దొటుపాటుం జెందుచుంటివి. కొంచె మోపికపట్టుము. ఇంతకు మున్నె వచ్చుచుందురు. ఆచెలికత్తె నీకుం జిక్కినను నిన్ను మాయచేసి దాటిపోంగలదు. [ఇరువురు దొంగలు కరవాలధారులై రక్తసిక్తాంగములతో సుదర్శనుని వెంటంబెట్టుకొని ప్రవేశించుచున్నారు.]

పరిఘ—నాయకుండా!

ఉ॥ చెచ్చెఱ మేము రాజగృహసీమ నిరర్గళవేగధాటిలోం
జొచ్చి, కవాటబంధములం జుల్కంగ వ్రక్కలుగాంగం దన్ని, పెం

పెచ్చుగ విప్రమందసము లెల్ల నగల్చి, సువర్ణరత్నసం
పచ్చయమెల్లఁ గొల్లగొని, ధ్వంసమొనర్చితి మెల్లతావులన్ ॥ 3

కరా—బాగుబాగు మీరిట్టి కార్యములయం దప్రతిహతులని లోకప్రసిద్ధియేగదా! ఈ రెక్కలు విరిచి కట్టఁబడిన వాఁ డెవఁడు?

ద్వితీ—దేవా! మనవాఁడు చెప్పినటుల రాజమందిరమున మనపనినిఁ బూర్తిపరచుకొని యేలినవారియాజ్ఞానుసారము రాజపుత్రిక నన్వేషించుచు నంతఃపురమునఁ బ్రవేశించితిమి. అంతనితఁ డంతఃపురాంగనలతో సరససల్లాపములఁ గాలము బుచ్చుచు మమ్ముం గాంచి రోషారుణిత నేత్ర వదనుండై కరవాలంబు నొరనుండి పెరికి మాపైదుమికి-

ఉ॥ కొందఱి కుత్తుకల్ దెగి, కొందఱి బాహుల వ్రక్కలించియుం,
గొందఱి ముక్కులం దరిగి, కొందఱి డొక్కలు చించివైచియుం,
గొందఱి జంఘలం దునిమి, కొందఱి నాలుక లూడ లాగియుం
జిందఱవందఱౌనటులఁ జేసె; బలంబు చలంబు మీఱఁగన్॥ 4

నికుం—ఏమి! వీని వలన మన దండునకుఁ గొంత నష్టముఁగూడ సంభవించెనా? దౌష్ట్యమునకుం దగిన ప్రతిఫల మనుభవింపకపోఁడు [తలయూఁచును]

కరా—ఏమీ! వీఁడు రాజాంతఃపురద్రోహియా? ఖండఖండములుగఁ గోయించెదను. ఇట్టి మాయోపాయములచే రాజపుత్రి నపహరింప నెంచితివా? ఆదిమాసామ్ము. ఏది రాజపుత్రిక యెచ్చట?

ద్వితీ—ఈతని సమరసంరంభమునఁ దగులుకొని మేమందఱముఁ జెల్లాచెదరై యల్లాడుచుండ యువతీజనం బెటులనో తప్పించుకొనిపోయెను.

కరా—[సుదర్శను నుద్దేశించి] ఓరీ! రాజద్రోహీ! నీవు భానుమంతునికిని మాకును గూడ నపచార మొనర్చితివి. బాహుబలంబునఁ దప్పించుకొనిపోవ నుంకించితివిగాని యది వమ్మయ్యెను. నాచేఁ జిక్కితివి. భృత్యులారా! వీనిం దీసికొనిపోయి శిరచ్ఛేద మొనర్పుఁడు.

సుద—నేను రాజానుమతంబున నీ యామెను బొందఁగలను. నీవలె నక్రమప్రయత్నములను మేము సల్పము.

నికుం—నాయకుఁడా! ఈతఁ డెవ్వఁడో యెఱుంగుదువా?

కరా—ఎఱుంగక యేమి? మనము కోటలోనఁ బ్రవేశించుటకు మార్గదర్శియాతఁడే గదా!

నికుం—నేనావిషయముఁ జెప్పుటలేదు. ఈతఁడు మొన్న మొన్నటివఱకు మనమా దోపిడిఁగావించివచ్చిన కాశ్మీరదేశాధిపతి.

కరా—అటులనా! మనమాదేశమున నున్నంతకాలము నెన్నఁడు నాకంటఁ బడి యుండలేదే? భానుమంతుని మెప్పువడసి విద్యున్మాలం గొనవలెనని వీనియాశ కాని యిదివ్యర్థప్రయత్నమని యెఱుంగఁడు. భానుమంతుఁడేడ! వీనికిచ్చుట యేడ!

నికుం—ఈతని రాజ్య మపహరముగుటచే మనవృత్తాంత మీతనికిఁ దెలియకపోయియుండ వచ్చును. మఱియు నిట్టివానిని మన మిప్పు డూరక పరిమార్చినఁ గలుగు ప్రయోజన మేమియులేదు. మన కారాగారమున నుంచుకొనినఁ గొలఁదికాలంబున మనకుఁ గోరినంత ద్రవ్య మొసంగి కాశ్మీరదేశీయులే విడిపించుకొనఁగలరు. ఇంతలో విద్యున్మాలను నీవేకైకొనఁగలవు.

కరా—మిత్రమా! నీవు చెప్పినది మిక్కిలి చక్కఁగానున్నది. మితవాదులడ్డుదగులని యెడల నేతన్మూలమున మనము గొప్పధనమును బడయవచ్చును. ఓరీ! సేవకులారా! ఈతనిం గొనిపోయి బందిగమునం దుంచి కడు జాగరూకతతోఁ గాపాడుచుండుఁడు. [ఇరువురు సుదర్శనునితో నిష్క్రమింతురు]

కరా—మిత్రమా! ఒకటి తలఁచిన నింకొకటి యైనది. రాజకన్యాసమావేశమునకై యువ్విళ్ళూరుచున్న నాకీ సమాచారము కడు విషాదకరముగానున్నది.

నికుం—కోట మనచేతిలోఁ జిక్కినప్పుడు రాజపుత్రిక మనచేఁబడకుండ నెంతకాల మెచ్చట డాఁగఁగలదు? విరహాతురుండవై ధైర్యకవచమును విడువకుము. మన గుంపునందు హతశేషులింకను కోటలోనుండియే యున్నారు. వారామెను గాని, చెలికత్తెలనుగాని పట్టుకొనక మానరు. సమయానుసారియగు విదూషకమితవాదావరోధము కలుగకుండ సుదర్శనుండు మనకుఁ జిక్కుటయే శుభసూచకము.

కరా—ఔను. నీవు చెప్పినటుల హతశేషులందఱును దిరిగివచ్చుదనుక మనము నిరాశఁ జెందవలదు.

[ఇరువురు దొంగలు చతురికను బట్టితెత్తురు].

చతు—[తనలో] హా! దైవమా! ప్రియసమావేశంబున నాప్రియసఖి యానందమున నోలలాడుచుండునని సంతసించుచుండ రాజమందిర మెల్ల దొంగలచే దోఁచఁబడుటయేగాక సుదర్శనుండుఁగూడ వారిచేఁ జిక్కుట యెంతపాపము! హతవిధీ! మమ్మిట్టి యిక్కట్టుల పాలుసేయ మీకేమి యపకృతి నొనర్చితిమి? సుదర్శనుండు దొంగలచేఁ గారాగృహంబున బంధింపఁబడెనని చేటీముఖంబున విని పాపమా విద్యున్మాల కన్నీరు మున్నీరై పొఱిఁ గడుంగడు విలపించి "చతురికా! కాశ్మీరమునకుఁ బోయి నామనోవల్లభు నిటకుఁదోడితెచ్చినదాన వీవేకావున నాతని నీయాపదనుండి తప్పింపవలసిన భారము నీయందేయున్న" దని యతిదైన్యముతోఁ బలుకఁ దగుదునని నేనందుల కొడంబడితిని. తానొకటి

దలంచిన దైవమొకటిదలంచు ననుసామెత నాయెడలనే నిక్కమయినది. నే నెటులనో రాజమందిరమందలి దొంగల బారినుండి తప్పించుకొని వారిదృష్టిం బడకుండం బౌరాంగనా విధానంబున నటించి కార్యసాధనమునకై పోవుచుండ నీదుష్టులు నన్నాసవాలుపట్టి తీసికొనివచ్చిరి. ఈసంగతి నాచెలికిం జెప్పువారైన నెవ్వరును లేరు. నాకు వీండ్ర చేతిలో నేమి పరాభవము కానున్నదో తెలియదు. కానిమ్ము. అధైర్యపడిన నేమిప్రయోజనము? సర్వము దైవాధీనము. ధర్మమే జయమను నార్యోక్తి వ్యర్థమగునా?

[ముగ్గురుం గరాళుని సమీపించుచున్నారు]

ప్రథ— ఏలికా! ఈమె రాజకుమారి చెలికత్తె. ఎటులనో తప్పించుకొని రాజమార్గము నంబడి పోవుచుండంగా మేమాసవాలుపట్టి పట్టుకొని తోడ్తెచ్చితిమి. ఏమి సెలవు?

నికుం— ఓరీ! ఇదిరాజకుమారి చెలికత్తెయని మీకెట్లు తెలిసినది?

ద్వితీ— అయ్యా! నేటిరాత్రి మనము కోటగుమ్మముకడం గాచుకొని యుండ నీలవైచి తలుపుం దీయించిన దీమెయే.

నికుం— దేశకాలానుగతికముగ క్షణమున కొకవైఖరినిమారంగలటక్కరి యీమె దేశాంతరమునకుం బంపిన పీడవిడుగడయగును.

కరా— [స్వగతము] ఆపెంబోవు తీర్థ మెదురైనట్లు నేనెవ్వరికై పరితపించుచుంటినో యామె చెలికత్తెయే మనచేం జిక్కుటంజేసి నామనోరథము సిద్ధించినదనియే తలంచెదను. ఈమెయెడ సామ, భేద, దాన, దండములం బ్రయోగించి కార్యసాధన మొనర్చెదను. [ప్రకాశము] ఓయింతీ! నీవా విద్యున్మాల సహచారిణివా? నీపేరేమి?

చతు— చతురిక.

కరా— చతురికా! మీచెలికత్తె మిక్కిలి యందగత్తెయని ప్రతీతిగలదు. అది యెంతవఱకు సత్యము?

చతు— [తనలో] వీనికి మెదడునందుం గీటకము చలించుచున్నట్లున్నది. ఏదారికి వచ్చునో చూచెదనుగాక! [ప్రకాశము] అంతఃపురాంగన లందఱ నెట్లుందురో యీమెయునట్లే.

కరా— దేశకాలముల గుర్తెఱింగి యథోచితముగాం బ్రవర్తింపసమర్థులగువారినే చతురులందురు. నీవును నీనామమును సార్థక మొనర్తువనుకొందును. ఏయెండకా గొడుగు పట్టనేర్చినదానవు.

చతు— ఆడువాండ్రము. అందునను సేవకవృత్తితో వర్తించువాండ్రము నగు మాబోట్లును సార్థకనామల మెట్లగుదుము?

కరా— మీచెలి-

క॥ నెరజాణయుంట కడురూ
పరియుంట మనోజలీల బహుభంగులఁ జా
తురికలదంట మిగులం బి
త్తరియౌనఁట చతురికా! యథార్థంబటవే? 5

చతు—[ఆత్మగతము] దుర్మార్గుల కుచితానుచితములతోఁ బనిలేదు. కావున నే వీని కిట్టి దురూహలు పొడముచున్నవి. నేను వీనితో నిట్లు సంభాషించి చూచెదను. [ప్రకాశము] అయ్యో! విద్యున్మాల కేవలముగ్ధ.

కరా—అబ్బో! ఈ నీతుల కేమి?

గీ॥ దంశిమగవార లెంట లేకుండఁ జూచి
ప్రీతి నడుగేయి నీబోటి దూతినంపి
హేతుల గావించి వారితో నతులగతుల
ముచ్చటించుచునుంటయే? ముగుదతనము॥ 6

చతు—అంతఃపుర వృత్తాంతంబు లెఱుఁగని వారిట్లే యనుకొందురు.

కరా—దీనికేమి?

సీ॥ జలజాక్షి నన్ను నీసఖురాలి రుచిరాంక
సింహాసనాంతరాసీనుఁ జేసి
బెడఁగారు రతిచేతి విరిదండలనుబోలు
భుజములు నాగళంబున నమర్చి
చతురకటాక్షవీక్షణరాజి తళతళల్
చందనమ్ముగ మేనియందు దలఁది
ఆనంద పారవశ్యమున వీడ్వడు కేశ
బంధంబు పేరి పీవనల నీచి
గీ॥ నిర్మలాధరసుధలఁ బానీయ మొసఁగి
కళరవమ్ములనంగమంగళరవమ్ము
లొదవఁ గుచకుంభములచేత మదనరాజ్య
మందుఁ బట్టాభిషిక్తుఁ జేయఁగదె! కరుణ॥ 7

చతు—ఓయీ! విద్యున్మాల కడు యోగ్యురాలు. నీవామెయందు దవ్యభావమును బూనవలదు.

చ॥ పరగఁగ సానఁబట్టఁబడు వజ్రము పంకము నొందనట్లు, బం
గరునకుఁ గుప్పపై కొనని కైవడి, తైలకణంబు నీటిలోఁ
బారయనిభంగి, నగ్నిఁ జెదవోయనిమాదిరి, నవ్యధూమణీ!
దురితమయప్రవర్తనము దొట్టదు నా తొలఁకింప నెన్నఁడున్॥ 8

కరా— ఈ శ్రీరంగనీతులకేమి. నీవిప్పుడు వంటయింటి కుందేల వైతివి. నా మాటవిని-

కం॥ పంచశరముల మరుఁడు నా
పంచప్రాణముల నొంచి పంచత నన్నొం
దించకమును సతి! జేరిచి
పంచేంద్రియములను దృప్తిపరచుము తరుణీ!॥ 9

అట్లొనర్చిన నిన్ను ధనకనకాదులచేఁ దృప్తినందించెదను. లేకున్న నాజన్మము నీకు నిర్బంధావాసమే గతి.

చతు— గీ॥ జారచోరాదివృత్తుల భూరిధనము
లెంద ఆర్జింప గీధాత్రి నెంచిమూఢ
ధనము ముఖ్యంబొకో! మానధనముగాని
మానహీనుల కెందు సన్మానమబ్బు? 10

కరా— (స్వగతము) సామభేద దానంబు లీమెయెడ వ్యర్థంబులయ్యెను. "దండం దశగుణం భవేత్" అని పలికిరిగాన దానినే యిప్పు డవలంబించి చూచెదను. ఈమె యెట్లు లొంగకుండునో? [ప్రకాశముగాఁ గ్రోధారుణిత లోచనుండై] ఓసీ! వలుమాయలమారీ! నీమూర్ఖతకుఁ దగిన ప్రాయశ్చిత్తము చేసెదనులే ఓరీ! సేవకులారా!

చ॥ తఱుగుఁడు దీనినాలుకను, దాండ్రను ముక్కలు గోసినట్లుగాఁ,
బెఱుకుఁడు దీనిగుండ్లు బలుపీకను ముంజెలు దీయునట్లుగా;
నఱుకుఁడు దీని నీతులను, నాశికఁ, గొప్పను నుగ్గునూచగాఁ;
గరములఁ దైలవస్త్రములు గట్టి కడున్ దివిటీ లొనర్పుఁడీ! 11

[భటులు సమీపించి పట్టుకొని యట్లుసేయ నుంకింతురు]

చతు— [తనలో] ఏమి యీదారుణము! ఈతఁడు కేవలము మూర్ఖుఁడగుటచే నంత పనియుం జేయించియే తీరును. తనకు మాలినధర్మముండదు గదా! దీనినుండి తప్పించుకొనుటయే ప్రథమకర్తవ్యము. [ప్రకాశము] ఓనాయకుఁడా! నేనింత

దనుక వేషనంబును బరిశీలించుటకై తరచితిని. నీవు విద్యున్మాలాగ్రహణంబున బద్ధకంకణుండవై యుండుట స్పష్టమైనది. నీకంతటి కోరిక కలిగిన వమ్మొనర్చుటకు నాసామ్మ్యమిపోయినది.

కరా—ఇట్లు దారికిరమ్ము. ఆమె యెచ్చటదాగియున్నదో చెప్పి పట్టియిచ్చినయెడల నీవీచెరనుండి విముక్తినందుటయేగాక యభీష్టసిద్ధినొందఁగలవు.

చతు—అయ్యా! అట్లేచేసెదను. అధికారబలములు నీవశములైయుండ మాబోంటి పరిచారికలకు నీకనుసన్నల వర్తించుటకంటెఁ గ్రొత్త యేమున్నది. కాని మాబోంట్లెప్పుడును కార్యానుకూలము సేయువార మగుటచేఁ జెప్పుచుంటిని. నీవామెను రాక్షస విధానమునఁ బరిగ్రహించుట కేవల మసంభవము.

కరా—ఏమిట్లనుచుంటివి! నిగూఢస్థలంబుఁ దెలిసినను మేమామెను బలాత్కారమున గ్రహింపలేమనియే తలంతువా!

చతు—నీకు బలముచాలదని నాతలంపు కాదు. మీభటులు రాజాంతఃపురంబునం బ్రవేశించి సుదర్శనుని బట్టి బంధించి కొనిపోయిన తోడనే రాజకన్యక తనకు నట్టియుపద్రవమే మీవలనఁ గలుగునని నిశ్చయించుకొని యొకవివిక్తప్రదేశమునం బ్రవేశించి, యుపద్రవము సంభవించునెడలఁ బట్టువడకమున్నె ప్రాణత్యాగ మొనరించుకొనుటకుఁ దగిన పరికరముల సంసిద్ధము చేసికొనియున్నది.

కరా—ఏమి! రాజపుత్రిక యంతకుశాగ్రబుద్ధియా? యామె మృతకళేబరమును సంపాదించుకొనిన మా కేమిలాభము? అట్లయినఁ బ్రకృతోపాయము నీవే తెల్పుము.

చతు—నీ యభిమతార్థసిద్ధికై చెప్పినపని చేయుటకు సంసిద్ధురాలనై యుంటిని. కర్తవ్యము మీరే యోజింపవలయును.

కరా—నీవిప్పు డెందుల కిచ్చటి కామెచేఁ బంపఁబడితివి?

చతు—మీచేఁ జిక్కిన తనప్రియుఁడైన సుదర్శనుని గతి యేమయ్యెనో కనుఁగొనుటకై నను బంపినది.

కరా—[తనలో] ఈమె యిప్పటికి నావలలోఁ బడి నాచెప్పుచేతలం జేయుటకు సిద్ధురాలైయున్నది. నే నిప్పు డీమెతోఁ జారుల నంపినను విద్యున్మాల యాత్మహత్యఁ గావించుకొని నామనోరథమును వ్యర్థమొనరించును. కావున నీమెతోనొక పన్నాగముం బన్ని విద్యున్మాల నారహస్యస్థలమునుండి మఱియొక తావునకుం దెప్పించెదను. [ప్రకాశము] చతురికా! నీవు నాకనుసన్నల మెలఁగ నిశ్చయించుకొనినందులకు మిక్కిలి సంతోషము. మాబోంట్ల యనుగ్రహము వ్యర్థముగాదు. మా నియోగమును నీవు జాగరూకతతో నెరవేర్చుకొని వచ్చినయెడల నీకుం దగిన సత్కారము గావించెదను.

చతు—నీపనుపును నిర్వహించుటకు నేనును, ఇంతకమున్నే సిద్ధపడియుంటిని. కావున నిస్సంశయముగఁ గర్తవ్యముం దెలుపుము.

కరా—నీవిప్పుడు విద్యున్మాలకడ కేగి సుదర్శనుఁడు దొంగలబారినుండి తప్పించుకొని యొక వివిక్తప్రదేశమున డాగియుండెననియు, నంతఃపుర మిపుడు వాసయోగ్యము కాదుగావున నిన్నుగూడ నచ్చటికిఁ దీసికొని రమ్మని నన్ను బంపెననియు, నచ్చఁజెప్పి యామె నచ్చటికిఁ దోడ్కొనిరమ్ము.

చతు—[కొంత పంకించి దీర్ఘాలోచనమును నటించుచు] నాయకుఁడా! యీపన్నుగడ యుక్తియుక్తముగానున్నది. కాని దివాణమున జరిగిన యల్లరులచే బెగ్గిలినదిగావున నిల్లువెడలి బయలుదేరుట కీయకొనదేమోయని సంశయముగలుగుచున్నది.

కరా— కం॥ ఆరమణి కెన్న ముఖ్యా
ధారంబగు సఖివి చిన్నతనముంగోలెం
జేరిక నెపుడెడబాయని
యాఅవపాణింబసీపు హరిణీనయనా! 12

కావున నీవు చెప్పినదాని నామె భిన్నము సేయదు.

చతు:—

ఉ॥ ప్రాణము మానముం గలిమి బల్మియు నావశముంబొనర్చి యెం
తే ననురాగమొప్ప నను నిమ్ములఁ నమ్మి చరించు నెచ్చెలిం
గానక మోసపుచ్చ సమకట్టితి; నక్కట! మచ్చరాలిచం
దాన నుతి:తకన్నను గృతఘ్నత వేఱొకటున్నదేధరన్॥ 13

కరా—ఇందుఁ గృతఘ్నత యేమున్నది? వైరివీరులచేఁ జిక్కి నవయుచుండిన సుదర్శనునిపై యనురాగముచే మగ్గిసీయక నీనెచ్చెలిని.

చ॥ సకల దిశాప్రసిద్ధ భుజసారధురంధరుఁడు గరాళనై
నికపరివారసంవృతుఁడ నిర్భలధైర్యపరాక్రమకరిమ
పరికటితనామధేయుఁడ, నపార రమావిభవుండ, శాత్రవాం
తకుఁడను నాకుఁ గూర్చుటకృతజ్ఞతగాక కృతఘ్నతెట్లగున్॥ 14

చతు—అయ్యా! నా స్తవముచే నెలవిచ్చితివి. నేనిందు నాప్రియసఖికిఁ జేయు నపకారము గాన్పించదు. అనురూపవరునితో సంఘటనం బొనర్చుచుంటిని. నానాఘటితమగుటచేఁ బ్రథమదర్శనంబున నించుక వెగటుగఁ గాన్పించినను, బర్యాలోచనంబున నామెకు నానందము సమకూరకమానదు.

కరా—నీవు కుశాగ్రబుద్ధివి. చాతుర్యవతివి. కావున సమయోచితము గ్రహించితివి.

చ॥ తరుణి నవారుణాధర సుధన్ గ్రహియించుచుఁ జెక్కుటద్దముం
దొరసిన మన్ముఖాకృతిఁ గనుంగొని చొక్కుచు మోహరాగవి
స్ఫురణ మెలర్పఁ గుల్కు నగవుల్ బచరించుచు మించి తద్భుజాం
తరమను పంజరంబున సదా శుకరాజమనై సుఖించెదన్॥ 15

చతురికా ! వైళంబ నీవేగి మదభీష్టసిద్ధిం గావింపుము.

చతు—నేను పోవునప్పుడును, నెచ్చెలిని వెంటఁబెట్టుకొని వచ్చునప్పుడును మార్గమధ్యంబున నీపరివారముచే నవరోధము గలుగకుండ నభిజ్ఞాన మేదయిన నొసంగినఁగాని యొకయడుగైన సాగదు.

కరా—సెబాస్ ! చతురికా ! చక్కఁగా గ్రహించితివి, నాయాజ్ఞ నతిక్రమించి నీవుగాని,నీసఖిగాని త్రిలోకములయం దెందుండినను నాసైన్యము పట్టి తేఁగలదు. కాన నభిజ్ఞానరహితంబుగా వెడలిన మీకనుపదంబు నాపాతంబు సంభవించును. ఇదిగో ! నాయంగుళీయకమును గైకొనుము. [అని యుంగరముం దీసి దానినుద్దేశించి]

మ॥ సమరూపప్రభగల్గు నాతరుణి హస్తం బీవుముట్టి కుమా
రిమిమై నఖరపఙ్క్తి దేటపడ మద్వృత్తాంతముం దెల్పి, యు
ద్ధమున న్నేజయలక్ష్మిఁ గైకొనిన చందం బందగింపంగ నిం
పుమెయి న్నీవిఁక నా కనంగవిజయంబుం గూర్పుమా యుంగరమా! 16

చతు—తథాస్తు. తప్పక నీ వనంగ విజయమునే పొందుదువుగాక ! నేను పోయివచ్చెదను. [ఉంగరమును దీసికొని నిష్క్రమించును]

కరా—[నికుంభు నుద్దేశించి] మిత్రుఁడా ! రాజకుమారి నావలలోఁ బడినది అచిరకాలములోనే యిచ్చటికి రాఁగలదు.

చ॥ ఇది కళలార ధాత్రి వసియించు సుధాకరరేఖ, చూడ నీ
యది నడనేర్చు హేమలత, ప్రాణము వ్రోసిన పైఁడిబొమ్మ, యీ
యది స్ఫుటమూర్తిఁ గొన్న మదనాజ్ఞ, నిసర్గచలస్వభావముం
బ్రిదిలి వెలుంగు చంచల, వరింపఁగ నాకిది మేలుబంతియా॥ 17

కావున నేనొంటరిగ నీమెరాకకై శయనాగారమున నిరీక్షించుచుండెదను. చాలరాత్రియైనది. మీరును విశ్రమింపుఁడు.

నికుం—తిరిగి వచ్చినప్పుడు సంతసింపవచ్చును. నేనామెను నమ్మఁజాలను.

[అందఱు నిష్క్రమించుచున్నారు]

ఇది తృతీయాంకము.

శ్రీ

# విద్యున్మాల

## చతుర్థాంకము.

రంగము—అంతఃపురములోని రహస్యమందిరము.

ప్రవేశము—[విద్యున్మాల యొంటిగ]

విద్యు—ఆహా! పాపదైవమా! ఇంతలో నెంత దెబ్బ పెట్టితివి.

సీ॥ కనుఁగొను టాది గాంతునిఁగూడి మనుభాగ్య
మెన్నఁడో యని వంతఁ గొన్నినాళ్ళు,
అతిగూఢగతిఁ జేటి నంపి వానికి మేలు
గొల్పుయత్నంబులఁ గొన్నినాళ్ళు,
పిదప నెప్పుడతండు విచ్చేసి కృప నన్ను
గొనునోయను నిరీక్షఁ గొన్నినాళ్ళు,
తడవైన నిఁక రాఁడితం డెట్లు మనుదునో
కోయంచు వలవంతఁ గొన్నినాళ్ళు,
గీ॥ గడపి తుదకిట్లు నెమ్మదిఁ గాంక్షదీర
యౌవనారామము ఫలించు నవసరమునఁ
దుముల భీకర ఝంఝూనిలములు వీచి
మొట్టమొదలంటఁ గూల్చితి వెట్టులకట! 1

హా! నాథ!

చ॥ తొలుత మహోచ్చసౌధమునఁ దోఁచినవేళ సుధాకరుండవై
వలువగు నీదు రూపమును నా చెలిఁ దెల్పఁగ మన్మథుండవై
తలఁపులు మొల్కలెత్తఁ బ్రమదావనమందు మనోహరుండవై
చెలఁగియు నన్ను నాథగను జేసితె కట్టడి దైవమాయచే॥ 2

ప్రాణేశ్వరా! రాక్షసప్రాయుఁడైన యీ కరాళునికి నిన్నర్పించుటకే యింత మారము నీస్వజనమునకు మాయనిగాఁజేసి తీసికొనివచ్చితిని గాఁబోలు? ఇంత పనిఁ జేసినందులకు నీయవస్థను బొందక నేనుమాత్రము సుఖపడుదునా?

చ॥ అరయఁగఁ బద్మినీవిభుఁడవై తగు నిన్ను గరాళకేతు వ
ర్వరఁ గబళింపఁ బద్మముఖిఁ బద్మవిలోచనఁ బద్మహస్త భా
స్వరతర పద్మపాద బిసబాహ మనోహరపద్మగంధినై
పరఁగెడు నాకును న్ముకుళభావముగాక వికాస మెట్లగున్ ॥ 3

ఆహా! ఈచలువ చప్పరములయందును, కేళాకూళులయందును, ఉద్యానవనములయందును, మహానందమునఁ బ్రొద్దుఁబుచ్చవలయునను దినంబులు వ్యర్థమయ్యెఁగదా!

చ॥ వర నవరత్నకుడ్యములు, బంగరు మెట్లును. కల్వోటపద్మముల్,
మరకతపుం గవాటములు, మంజుల చంద్రశిలాచ్ఛవేదికల్,
వరలు విలాసమందిరములన్ బహుళప్రతిబింబసృష్టిచే
హరువగు రాసలీలల విహార మనోరథముల్ నశించెనే? 4

నాటి యుద్యానవనమందలి నామూర్ఛ పెద్దనిద్దురగాఁ బరిణమించిన నాకీ విచారమే లేకపోవునుగదా!

ఉ॥ నాతనువల్లిపై భ్రమరనాథుఁడవై కలనిస్వనంబులం
బ్రీతిగ మన్ముఖాంబుజ మరందము గ్రోలుదువంచు నెంచఁగా
కేతకభాతిఁ జెక్కులకుఁ గేవల చంపకరీతి నాసకున్
భీతిలి యింతలో నిటుల వీడ్కొనిపోయితివే మనోహరా! 5

[అంగుళి నున్న యుంగరముం జూచి ఖిన్నవదనయై] ఓ మణిమంగుళీయకమా!

ఉ॥ నమ్మినబంటవంచు నిను నాహృదయేశుఁడు నన్ను గూర్పఁగా
నిమ్మెయిఁ బంప వ్యర్థముగ నిచ్చటనుండఁగనేల? నాదు డెం,
దమ్మునఁ జూర్ణమై యయినఁ దారొకసి వల్లభుతోడ స్వర్గలో
కమ్మునవైనఁ గూర్పు మటుగానియెడం గృతకృత్య తప్పునే? 6

అయ్యో! చతురికా! ఇంతకుమున్నె వార్తాహారి వచ్చి దుష్టులు నిన్నుగూడ హరించిరని చెప్పెను.

ఉ॥ చిన్నతనంబునుండియు నను జెల్మి భజించుచు రాజచంద్రుపైఁ
బన్నుగ నాకుఁ గల్గు వలపంత యెఱింగి మనోహరాంగునిం
గన్నను గూర్చి యస్వభుని కష్టములన్ భవదీయచాతురిం
దిన్నఁగఁ దీర్పఁబోయి యట నీవె విపజ్జలధి న్మునింగితే? 7

హా! నాథా! హా! ప్రియసఖీ! మీరిరువురును లేని యీ జీవితము నిరర్థకమేగదా! మిమ్ముల నిరువురిని మ్రింగిన కాలయముఁడు కరాళుండై నన్నుమాత్రము విడుచునా! వానిచేఁ జిక్కినఁ బయిపెచ్చు మానభంగముం గూడఁ దటస్థింపఁగలదు. అట్లేల జరుగును? కలదుగదా క్షత్రియాంగనోచితంబగు మానరక్షణోపాయము. హా! తండ్రీ! ప్రాణపరిత్యాగావస్థం దలంచుకొనిన నీవు జ్ఞప్తికి వచ్చుచుంటివి.

ఆ॥ నీవలన జనించి నీపోషణముఁ గాంచి
నీయధీనమగుచు నెగడు నసువు
లిపుడు నీయనుజ్ఞ యింతయు లేకుండఁ
బాపుచుంటిఁ దప్పు సైపవలయు॥ 8

హా! తండ్రీ! హా! నాథా! హా! ప్రియసఖీ! ఇంక మిమ్ముఁ జూచు భాగ్య మీవిద్యున్మాలకు లేదు. [ఉంగరమును మ్రింగఁ బోవును]

చతు—[పటాక్షేపముగాఁ బ్రవేశించి విద్యున్మాల చేయిఁ బట్టుకొని] సఖీ! విద్యున్మాలా! యేమి యీ సాహసము? శక్తియుక్తులఁ గార్యసాధనమునకైఁ బ్రయత్నించుట ధర్మముగాని వేలపై యిట్లు ప్రాణత్యాగము గావింపఁ బూనుట యుక్తమా?

విద్యు—ఏమి! నాప్రియసఖియగు చతురికయేనా?

మ॥ కలయో? లేకిది శత్రుమాయయొ? యెటుంగం జిత్తవిభ్రాంతియో?
కలఁగం జాలెను యింద్రియంబులు? కనంగ భూతమావేశమై
కలఁతం బెట్టెనో? కాకయుండిన నశక్యంబైన నాయున్నన
చ్చెలి సందర్శనమెట్లులబ్బు? నకటా! చిత్రంబుగాఁ దోఁచెడిన్ 9

చతు—విద్యున్మాలా ! నేను దయ్యమునుగాను. భూతమునుగాను. మీచెలికత్తెనగు చతురికనే.

విద్యు—[కంఠాశ్లేషము గావించి] సఖీ ! నామనం బింకను విశ్వసింపకున్నది. నీవు నిక్కముగఁ జతురికవేనా ? నానాథునిగతి యేమయ్యెనో తెలిసికొని వచ్చితివా ?

చతు—నేను తెలిసికొనినతోడనే విడుచుదానవా ?

విద్యు—నిన్ను జోరులు పట్టుకొనిపోయిరని పరిచారికవలన వినియుంటిని పిదప నేమ య్యెనో చెప్పుము ?

చతు—నాచతుర వచన రచనల వానిఁ గలమొనగాని మోసపుచ్చి వానియంగుళీయక మును సంగ్రహించి వానిబారినుండి తప్పించుకొంటిని.

విద్యు—నానాథునివిషయము తెలిసికొన నాయంతరాత్మ తొందరపడుచున్నది. తర్వాత నేమిజరిగినది ?

చతు—అచ్చటినుండి తిన్నఁగాఁ జెఱసాలకుం బోయి యాయంగుళీయక ప్రభావంబున లోనఁ బ్రవేశించి నీనాథునిం గాంచితిని.

విద్యు—ఆహా !

చ॥ పలువుర దుష్టులం జెఱను వైచి ప్రభుత్వముఁజూపి సాధసీ
మల వసియించు భూమిపతి మానము దక్కి దురాత్ముచేత ని
ట్టలముగ బందిగంబున నిడంబడెనంచు వినంగనోచె వె
గ్గలముగ నాదువీనులు జగంబున నింతటికష్టముండునే ?

చతు—చెలీ ! ఇంతమాత్రమున నీవు మనోవైకల్యమును జెందుట యుక్తముగాదు. ఆపదలు కాపురముసేయునా ?

విద్యు—తరువాత నేమిజరిగినది ?

చతు—ఆతనికి నాదుస్తుల ధరింపనిచ్చి యాతని దుస్తులను నేను ధరించుకొనియంగుళీ యకము నిచ్చి సుదర్శనుని కారాగృహమునుండి పంపివైచితిని.

విద్యు—ఆహా ! చతురికా ! నీచతురత కొనియాడఁదగినది.

గీ॥ నారమణుఁడు సతీవేషధారి యగుచు
నరుగు వేళ జగన్మోహనావతార

మును ధరించిన శ్రీ విష్ణుమూర్తి పోల్కి
మహిమ విలసిల్లె ననుచు నామదిఁ దలంతు॥ 11

నీవెట్లు తప్పించుకొని బయలుపడితివి ?

చతు—కొంతసేపటికా కోటలలో నొకఁడు నాకాహారము దెచ్చిపెట్టి యేమరిపాటునఁ గూర్చుండియుండ వానిం బరిమార్చి వాని వేషమును ధరించుకొని కారాగారమును యథాస్థితిని మూసి వెడలివచ్చితిని.

విద్యు—చతురికా! మంచిపనిజేసితివి. నీకుఁ గార్యసాధనమందు సమయస్ఫూర్తి మెండు.

చతు—కం॥ ఆపదలయందు నెల్లర
కాపగిదిన యూహలబ్బు నగ్నిజ్వాలన్
రూపరి గృహములు గాలఁగ
మోపగుఁ బరు వబలుఁడైన మోయుంగాదే! 12

విద్యు—సఖీ! నీవా కరాళునిబారినుండి యెట్లు తప్పించుకొనఁగలిగితివి ?

చతు—దానికి నీమహిమయే కారణము. నేను కేవలము నిమిత్తమాత్రంబను.

విద్యు—చెంగటనుండి కార్యమును సాధించుకొనివచ్చిన నీవు నిమిత్తమాత్రమవు. దూరమునుండి యేమియుఁ జేయని నేను ప్రధానకారణము నెట్లుకాఁగలము ?

చతు—గీ॥ భ్రమరములఁ బద్మినీసముఖమును జేర్ప
గంధవహుఁ డెంచఁగ నిమిత్తకారణంబు;
గంధము ప్రధానహేతువుగా నెసంగు
నట్టులనె నేను నీవు నో యంబుజాక్షి! 13

విద్యు—[సక్రోధముగా] ఏమీ! ఆదుర్మార్గుఁడు జనకుఁ డింటలేని సమయమునఁ జొటప్పరుఁడై కోటలోని సర్వస్వము నపహరించుటయేఁ గాక యంతఃపుర పద్మినీహరణంబుం గూడఁ జేయ నిశ్చయించెనుగా? [ఇంచుక యోజించి] ఎవఁడు త్రవ్వుకొనిన గోతిలో వానినే పడఁద్రోయుట భగవద్విలాసమైయున్నది. ఈదుష్టుని కంతకాలము సమీపించుటచేతనే నాపై నాసపడమినది. ప్రాణనాధుఁడు నీవునుఁ గూడ వారి బారినుండి తప్పించుకొనఁ జాలరని ప్రాణత్యాగమునకుఁ దగిన పరికరంబుల నాయత్తపరచుకొనియుంటిని. మీ రుభయులును బయలుపడితిరి గావున నిఁక నీకరాళుని సంభావింతము.

సీ॥ అబ్జినీకాంతుఁ డపరాబ్ధికరిఁగెఁ గానఁ
గల్మష కరాళ చంచరీకమునుబట్టి
పద్మినీ బంధనాలయ ప్రాపితంబుఁ
జేసి గాసిల్లఁజేయుట వాసిగాదె! 14

చతు—ఏమి నీబుద్ధిచాకచక్యము! నన్నిఁకొకపరి మృత్యుముఖంబునఁ బడఁద్రోచెదవా?

విద్యు—తదభీష్టప్రదాయినివయి నటించుచు నాతనికే నీవు మృత్యుముఖంబుగాఁ గలవు.

చతు—నిన్నే యాతనికడకుఁ దోడితెచ్చెదనని బొంకివచ్చితినే!

విద్యు— గీ॥ ఒక్కచోఁ గూడు జలద మింకొక్కచోటి
కచ్చటవసించు మేఘంబు లిచ్చటికిని
నింగి మార్చు పవనుపోల్కి నిపుణబుద్ధు
లరయ నఘటిత ఘటనా సమర్థులుగద! 15

చతు—అట్లయిన నన్ను బోయి వానిం దీసికొనిరమ్మందువా?

విద్యు—చెలీ!

చ॥ తొలఁగక కేతకిం దగులు తుమ్మెదపోలిక, దీపహేతిపై
శలభమురీతి, వెల్లివిరి జాల్కొను తీయని నీటికెక్కు నా
జలచరమట్టు లింద్రియవశంవదులై తగు జీవుభంగి నా
ఖలు నిటు దోడితెచ్చి కడఁకం దగు శాస్తియొనర్పు మోసఖీ! 16

చతు—నెచ్చెలి సంకల్పమునకు వికల్పము సంభవించునా? అట్లే యొనర్తును.

[నిష్క్రమించును]

విద్యు—ఆహా! నాథా! నేనీ దుర్మార్గుని వారినుండి తప్పించుకొనుటకీ యుక్తిం బన్నుచుంటిని. కులాంగనల కిట్టి కృత్యంబు లాచరణీయంబు లగునాయని నామనంబు పరిపరివిధంబులఁ బరితపించుచున్నది.

చ॥ పసుపడి బాల్యమందు మనుపందగు తండ్రియు నూరలేడు; యా
వనమునఁ బ్రోవఁగాఁదగిన వల్లభుఁడుం రిపుమాయఁజిక్కె; నే
యనువున నింక మానమును, బ్రాణముఁ గాచుట సంభవించుఁ గా
వున నిటుగాని చెవునకుఁ బూనితిఁ జెల్లరె! పాపబుద్ధిపై! 17

లోకమున మున్నెవ్వరికైన మానవతుల కిట్టి యాపదలు సంభవించినవా? నిర్భాగ్యురాల నగు నానొసటనే పాపిద్దుపొడిచినదా! ఆహా! అటులనుకొన నేల?

కం॥ మున్నల ద్రౌపది కీచకు
బన్నముఁ దప్పించుకొనఁగ బహుచతురమతిం
బన్నుగడఁ బన్ని వానిం
బన్నము పాల్సేయలేదె? పాపముదానన్॥ 18

ఏమిది! కరాళుని వేసికొనివచ్చెదనని చెప్పి నాప్రియసఖిపోయి చాల తడవయ్యెనే! క్రొత్తయాపద లింకేమయినఁ దటస్థించి యుండలేదుగద!

కం॥ తగిలిన కాలనె తగులన్
మొగిలిన యిలు నొగులునవెడి నుడువుంబోలెన్
జగతిపయి నెన్నఁడయినం
దగిలెడు నాపదలె యాపదలపై నెపుడున్॥ 19

[కరాళుని వెంటఁబెట్టుకొని చతురిక ప్రవేశించును]

కరా—[విద్యున్మాలం జూచి] ఆహా! ఏమి నాభాగ్యము. నేనెన్నియాస్థానముల ధనాగారంబులఁ గొల్లగొనిన నింతటి భాగ్యమెచ్చటను లభించలేదే!

చ॥ తనువును, మందహాసమును, దంతములుం, బెదవుల్, నఖంబులుం,
బెనుగురులుం, గరంబులును, బేర్కొన బంగరు, వెండి, ముత్తెముల్,
పనుపడు మేలికెంపులును, వజ్రములున్, మఱి యింద్రనీలముల్
నునుబగడంబులున్, బ్రభలు నూల్కొనఁ గప్పులు వ్రాసినట్లగున్॥

చతు—అయ్యా! యీ యాసనము నలంకరింపుఁడు.

కరా—[కూర్చుండి] ప్రాణేశ్వరీ! విద్యున్మాలా! నీవుఁగూడ నిటువచ్చి నాయంకతలంబున నధిష్ఠింపుము.

విద్యు—[తలవంచుకొని యూరకుండును]

కరా—[లేచి సమీపింపఁబోయి]

కం॥ ఏమే పాటలగంధీ!
యేమే రాకేందువదన! యేమే రమణీ!

యేమే మధువ్రతాలక!
యేమే శుకవాణి! నన్ను గృపఁజూడఁగదే! 21

విద్యు—[తనలో] ఏమీ! యీ మూర్ఖునకు మన్మథోద్రేకము మతిచెఱచుచున్నది. ఎట్టిదుర్మార్గులకైన సదుపదేశ మొనర్పకయే దండించుట తగవుగాదు. [ప్రకాశము] నీవంటివాని కిట్టులఁ బరాంగనల నిర్బంధించుట తగవుగాదు.

కరా—ప్రేయసీ!

గీ॥ ఇంచువిలుకాఁడు నన్ను బాధించుచుండఁ
దాళఁజాలక నీపై విరాళిఁజెంది
నిన్ను బ్రార్థించెదనుగాని నీలవేణి!
పట్టి నిర్బంధ మొనరించు వాఁడఁ గాను॥ 22

విద్యు—ఓయీ! నీవు కేవలము నింద్రియవశంవదుఁడవయి పలుకుచుంటివి. వినుము, తొల్లి.

ఉ॥ భూమిజఁ గోరి రావణుఁడు పుత్రకళత్ర హితాళితోడ స
గ్రామమునందుఁ జేర్పడఁడె? ద్రౌపదిఁ గోరిన కీచకుండునుం
భీమునిచే బడల్పడఁడె? భీమసుతం దమయంతిఁ గోరి యు
ద్దామ మహోగ్ర చాపమున దగ్ధుఁడు గాఁడె? కిరాతకుం డిలన్॥

కరా—సుందరీ!

చ॥ రమణులు బాహువిక్రమ ధురంధరులౌ మముబోటి వారికిం
దమిమెయి భోగసాధన మనందగువారలు; లోకమందు వి
క్రమమున నెవ్వఁ డేతరుణిఁ గైవసముం బొనరించు; వారి కా
ప్రమద నిరంతరంబు వశవర్తినియై మెలఁగం దగుం గదే! 24

విద్యు—[చతురికతో నపవారించి] సఖీ! చూచితివా? ఈ ద్విపాదపశువుయొక్క మౌర్ఖ్యము?

చతు—[అపవారించి] కానికాలము తటస్థించుటచే నీవంటి పుణ్యచారిణికిఁ గూడఁ గృత్రిమమార్గమునకైన దుష్టునితోఁ బ్రసంగింపవలసివచ్చినది. మున్ను వసుదేవుఁడు ఖర చరణంబులు బట్టుకొనఁడా?

విద్యు—ఓయీ! నీవనినట్లు స్త్రీలు పురుషులచేతి కీలుబొమ్మలే యనుకొనినను నీక్షేమమునైనఁ జూచుకొనవలదా?

కరా—ఏమి! ఇందు నాక్షేమమున కాతంక మేమికలదు?

విద్యు—మాతండ్రిగారు వెడలిన దండయాత్రయందు విజయులై త్వరలో రానై యున్నారు. వారు వచ్చి నిన్నెట్లు సన్మానింతురో దానిం దలంచుకొనుము.

కరా—ఓసి వెఱ్ఱిదానా!

గీ॥ అల్లుఁడనని నను జావి నిజాత్మజాత
వైన నీ కుగ్రవైధవ్య మబ్బఁజేయు
నట్టిపాపిష్ఠుఁడె నీతండ్రి? యట్టులేని
యెలుక కై యిల్లుఁగాల్చువాఁడే నిజంబు॥    25

విద్యు—ఆతఁ డందులకే సంసిద్ధుఁడైన నేమి చేయఁగలవు?

కరా—ఏమీ! ఏమనుచుంటివి? కరాళుని బరాక్రమ హీనునిగా నెంచితివా యేమి?

చూరకము—[అడిదము జళిపించుచు]

సీ॥ అక్షతాక్షీణ కౌక్షేయకాగ్రధార
నిక్షుదండంబు లట్లు విపక్షసైన్య
పక్షుల రణక్షితిని దత్సమక్షమందు
ఖండఖండంబులుగఁ జేతుఁగా మృగాక్షి!

[కన్ను లెఱ్ఱఁజేసి విద్యున్మాలపై దుముకఁబోవును]

విద్యు—[తొలఁగి నిర్విణ్ణయై యుండును]

చతు—[అడ్డమువచ్చి] అయ్యా! శాంతింపుఁడు శాంతింపుఁడు.

గీ॥ పడఁతి, యబల, నీప్రేమకుఁ బాత్రురాలు,
గాని సాధింప శత్రువుగాదు; సదయ
వీక్షణము లిప్డు నెరపంగ వేళగాని
తరళ ఖడ్గప్రభావళిఁ బరపఁ దగునె?    27

కరా—అట్లయిన నేమిసేయు మందువు?

చతు-చ॥ ముకుళిత సారసాంతర సముజ్జ్వల సార మరందమానఁ జెం
తకుఁ జనుదెంచి మంజుకలనాదములం బచరించి, చయ్యనన్
వికసన మొందుదాఁకఁ దఱివేచు మధువ్రతమట్లు కామియుం
డికమిక సేయుభోగ సుదతీమణి నేర్పునఁ జేర్పఁగాఁ దగున్ 28

కరా—మాకట్టి యోపికలతోఁ బనిలేదు.

విద్యు—[అపవారించి] చతురికా! వీనికిఁ గాల మాసన్నమైనది. కర్తవ్యమునకుం ద్వర పడుము.

కరా—నామాట విందువా? లేక పెడచెవిఁ బెట్టెదవా?

చతు—అయ్యా! ఆవిషయము ననుసంధానమును గావింపవలసినదానను నేను. తామాగదియందలి పర్యంకమున నధివసింపుఁడు. నే నీమెను బుజ్జగించి తోడ్కొనివచ్చెదను.

కరా—ఆలసించిన నేను సహించువాఁడనుగాను.

చతు—ఆలస్యము లేదు. కాల మాసన్నమైనది.

కరా—నీవెంతకయిన సమర్థురాలవే.

[లోనికింజని యంత్రపర్యంకమున నధివసించును.]

చతు—[సమీపించి] అయ్యా! మాచెలి వచ్చునంతదనుక నీయల్పాహారము నారగించుచుండుఁడు.

[రెండు మినపసున్ని యుండలఁ బళ్లెరముతో నుంచును]

కరా—అట్లె. శీఘ్రముగాఁ దోడ్కొనిరమ్మా.

చతు—మంచిది. [విద్యున్మాలను సమీపించును.]

కరా—ఇఁక నాలసింపరాదు. చెలివచ్చునంతలో నామెకొక యుండ నుంచి నేనీయుండన్ను భక్షించెదను.

[ఆత్రముతో నున్ని యుండ నొక్కమారె నోటవైచికొని నమలుచుండును; కీలు మంచము పెళపెళ విరుగుచుండును.]

కరా—[చచ్చితిని మిత్రమాయని కేకలు వెట్టఁబోయి నోటమాటరాక "హాబ్బొబ్బొ" యని లేచి యురుకఁబోయి మంచముతోఁగూడఁ గ్రింద నెలకొనియున్న పాతాళకూపమునఁ గూలుచుండును.]

చతు—నీకుఁ దగిన ప్రాయశ్చిత్తమైనది. నీనికుంభుఁడు వచ్చి నిన్ను లోకాంతరమున నాదుకొనునులే. [విద్యున్మాల నుద్దేశించి] నెచ్చెలీ! యిప్పటికిఁ గృతార్థురాల వైతివి.

విద్యు—ఇందు నాప్రజ్ఞ యేమున్నది?

తే. దనుజవిభుఁడగు బలినిఁ బాతాళమునకుఁ
గూలఁద్రోచిన వామనుఁబోలె నిపుడు
కూళయగు వీని పాతాళకూపమునకుఁ
ద్రోచితివిగాదె! మిగులఁ జాతుర్య మొప్ప. 29

చతు—మన మిప్పటికిఁ జరితార్థుల మైతిమిగాని, యింకొకటి శంకించుచున్నది. ఈతని మిత్రుఁడగు నికుంభుఁడు వీనికంటె నేరాపు లెక్కువ చదివినవాఁడు. స్త్రీయంత్రపరిభావ మాతనియొద్ద సాగనేరదు. వాఁడీతనిని వెన్నంటి రాక మానఁడు. కావున మనము పౌరులవలెఁ బురుషవేషములు ధరించి యూరుఁ జేరి యే పర్ణకుటీరములయందైన నివసించి నీతండ్రిగాని, నీనాథుఁడుగాని వచ్చి వీరి నెల్ల నంతకపురికిఁ బంపుదనుకఁ దలదాచుకొనుటయే ముఖ్యాంశము.

విద్యు—అటులనే చేయుదము రమ్ము.

[అందఱు నిష్క్రమింతురు]

ఇది చతుర్థాంకము.

---

శ్రీ

# విద్యాస్నాల

పంచమాంకము.

విష్కంభము.

[ఇద్దరు పౌరులు ప్రవేశించుచున్నారు.]

ప్రథ—అన్నా! గ్రామములోని విశేషములేమి?

ద్వితీ—అన్నియు విశేషములే. దూరదేశమునుండి వచ్చినట్లు కాన్పించుచుంటివే? ఇచ్చటి సంగతులేమియు నీకుఁ దెలియవా?

ప్రథ—ఔను. మహారాజుతో దండయాత్రకు వెడలి యుంటిని. రాజు సేనాసమేతుఁడై మరలివచ్చుచు విజయవార్తను మనదేశమున ముందు ప్రకటింపుమని పంపుటచే నేఁడే వచ్చితిని.

ద్వితీ—అచ్చటి విజయ మెట్లున్నను దండయాత్రాఫలము ముం దిచ్చటనే ఫలించినది.

ప్రథ—ఏ మిట్లనుచుంటివి?

ద్వితీ—కరాళుఁడను దొంగల నాయకుఁడు కలఁడుగదా! వాని ప్రతాపమును వినియేయుందువు.

ప్రథ—వినకేమి?

చ॥ పురముల నర్ధరాత్రములఁ బూర్ణదళంబులతోడ దొట్టి, మం
దిరముల నెల్ల సంపదల నెట్టనఁ బైఁబడి కొల్లగొట్టి, ని
ర్భరముగ స్త్రీల నెల్లఁ జెఱఁబట్టి, గృహంబులఁ జిచ్చువెట్టి, యు
ద్ధురగతి నద్దుహాల నెదుర్కొని మంటల నెట్టి కాల్పఁడే? 1

ద్వితీ—అతఁడు మన రాజుగారూరలేని సంగతిఁ దెలిసికొని యర్ధరాత్రమున నెటులనో తన గుంపుతోఁ గోటఁ బ్రవేశించెను.

ప్రథ—అయ్యో! ఎంతపనిజరిగినది! అట్లు ప్రవేశించి వాఁడేమిచేసెను?

ద్వితీ—ఏమిచేసెనని మెల్లఁగా నడుగుచుంటివా?

సీ॥ అంటించు చీనిచీనాంబరంబుల పొగల్
మేఘమండలియట్లు మిన్నుముట్టె;
అద్దంపుఁ దలుపుల బద్దలుగాఁ జేయు
రసితంబు లురుములై దెసలఁ బర్వె;
కొలువుసాలల మందుకొట్ల నంటించెడు
కొఱవులు కొఱవ్యాలుంగులన నొప్పె;
ఉరు కరాళకరాళ శరపరంపర లెల్లఁ
దముల ధారాళ వర్షమునుబోలె;

గీ॥ తత్తరంబున నటునిటు దొడువారు
నట్టి చోరుల గాలి జంఝూనిలముగఁ
బ్రిబల, వారల శౌర్యసంరంభ మెల్ల
జగము మాయించెను తుషానుపగిదిఁ దోఁచె. 2

ప్రిధ—ఇట్టి విపత్పరంపరలయందు భగవంతుఁడైన సుదర్శనుఁడే దిక్కు. ఇట్టి ఘోర మీకోటులలో నెన్నఁడయిన జరుగనునకొంటిమా? ఈదొంగలేమి? ఈయాగడరేమి?

ద్వితీ—నీవనినట్లు పనికంతకు సుదర్శనుఁడే దిక్కయ్యెను.

ప్రిధ—నీమాటలు నాకర్థమగుటలేదు. చావులో సరాగమేమిటి? మర్మమువిడిచి యేమిజరిగెనో తెల్పుము.

ద్వితీ—కాశ్మీరదేశాధీశ్వరుం డయిన సుదర్శనుని నీవు వినియుండలేదా?

ప్రిధ— కం॥ ద్విరద, రథ, హయ, పదాతి
స్ఫురదురు సైన్యములతోడ భూవలయంబుం
దిరిగి సుదర్శనధరణీ
శ్వరుఁ డొందెన్ దిగ్జయమున శశ్వద్యశమున్॥ 3

ద్వితీ—ఆతండు మృగయావినోదియై మనపురపరిసరారణ్యంబునఁగొలఁదిపరివారముతో సంచరించుచు నీ స్థేయుని కుటిలప్రవర్తనముఁ జారులవలన విని వారల నెన్నంటివచ్చి—

శా॥ గుప్పించెన్ శితసాయకంబులను గగ్గోలెత్తఁగా వైరులం
దొప్పించెన్ బహుచోరసంఘముల నచ్చో నంతకద్వారమున్
నొప్పించెన్ గజ వాజి దంత ఖుర పఙ్క్తుల్ మేనులం గాడుచున్
మెప్పించెన్ నర దేవ లోకముల నెంతే మేలు సంధించుచున్॥ 4

ప్రిథ—అంతునన నే కాఁబోలు.

కం॥ ఏను పురిఁజొచ్చి యొచ్చటఁ
గానఁగఁ బుత్తెలును, నెమ్మొకలుఁ, గేశములున్
జానుచెడు మొండెగోడలుఁ
బినుఁగుపెంటలుగఁ దోఁచె భీభత్సగతిన్॥ 5

ద్వితీ—ఓయీ! కరాళమిత్రుఁ డయిన నికుంభుఁ డద్వితీయుఁడై సుదర్శనసైన్యంబులఁ జెండాడుచుండ సుదర్శనుఁడు వానిపైఁ దలపడ వారిరువురికిని ద్వంద్వయుద్ధ మెంతఘోరముగా నుండెనో వక్కాణింప శక్యముగాదు.

ఉ॥ వారల హస్తలగ్న కరవాలరుచుల్ మిఱుమిట్లుగొల్పఁగా
వారల పాదఘట్టనలఁ బొల్పడి ధారుణి గంపమొందఁగా
వారల ముష్టిఘాతము లవారణ నాకసముం బగుల్పఁగా
వారల భీకరార్భటుల వ్రక్కలువారెను దిక్కులొక్కటన్॥ 6

ప్రథ—ఆహా! నికుంభుని ప్రతాపము నిరుపమానముగా నున్నదే. సుదర్శనునకేమియు ముప్పు వాటిల్లలేదుగదా!

ద్వితీ—అట్టి సందడికయ్యమున మన సుదర్శనుండు.

చ॥ వడిగ నికుంభుచేతి కరవాలముఁ గైకొని రెండుఖడ్గముల్
బెడిదముగాఁగఁ ద్రిప్పుచు విభీకర కేసరి గర్జనంబులం
జిడిముడి సంధిలన్ రిపుని జెక్కులు ముక్కలుగాఁగఁ జేసె; ను
క్కడఁగి తదీయసైన్య మసహాయగతిం బఱువెత్తె నత్తఱిన్॥ 7

ప్రథ—మేలుమేలు. మంచిపని జరిగినది. ఈసంక్షోభమున నింటియొద్ద స్త్రీజనం బెట్లుండెనో చూడక తడయరాదు. కావున మనము పోవుదము.

ద్వితీ—మంచిది— [నిష్క్రమింతురు]

ఇది విష్కంభము.

---

రంగము—రాజమందిరము.

ప్రవేశము—[సుదర్శనుఁడు, సునందుఁడు]

సునం—మిత్రమా! నీప్రతాపము ప్రశంసనీయమైనది.

గీ॥ ముచ్చుల దళంబు లన్నిటి రూపుమాపి,
యార్తపౌరుల హాహారవాళి నడఁచి,
శక్రసన్నిభ నిర్వక్ర విక్రమమునఁ
జల్లవే దిక్కులను గీర్తిచంద్రికలను.

సుద—ఉ॥ ఏసతి మెప్పు జొప్పడఁగ నింతపయత్నము జేసినాడనో
యేసతి ముప్పుదప్పఁగ నహీనబలాఢ్యతఁ జూపినాడనో
యేసతిపైఁ జిరంతనసుఖేచ్ఛలఁ బ్రాణము నిల్పినాడనో
యాసతి లేనినాఁడు విజయంబిది వ్యర్థముగాదె మిత్రమా! 8

సునం—మిత్రమా! అట్లనుకొననేల? ఈ రాజమందిరమున ననేక రహస్యసీమ లుం
డఁగలవు. ఎచ్చటనో డాగియుండును.

సుద—ఉ॥ కాంచితి రాజగేహమునఁ గల్గు సమస్తరహస్థలంబులం
గాంచితిఁ గష్టకాలమునఁ గాంతలు డాగు ధరాబిలంబులం
గాంచితిఁ గేళికావనులఁ గల్గు నిగూఢ నికుంజసీమలం
గాంచితి నెల్లతావులను, గానఁగనైతి లతాంగిజాడలన్ 10

ఇట్లుండ నాకామె లభించునను సంతోష మెట్లు కలుగును?

సునం—మిత్రమా! ముందు విజయలక్ష్మిని సంపాదించితివిగదా! గృహలక్ష్మియుఁ
బిమ్మటఁ జాతము.

సుద—మిత్రమా! సునందా!

సీ॥ అక్కున నెఱయు ఖడ్గాంకమాలికఁ గాంచి
యెడఁద హర్షించువా రెవ్వరింక?
ఘనభుజంబుల గదాఘాతాంగదంబుల
నెంచి మోదించువా రెవ్వరింక?
అడుగుల విశిఖపరిహారమంజీరమ్ము
నెమ్మిమై నరయువా రెవ్వరింక?
ఫాలపల్లకృత భర్మపట్టముగాంచి
యుమ్మల మురియువా రెవ్వరింక?
గీ॥ అట్టి జగదేకసుందరి, నట్టి శారదేందుముఖి, నట్టి నిర్మలహేమగాత్రి,
నట్టి కలహంసయానఁ బోఁగొట్టుకొంటి
విజయమేల? రాజ్యంబేల? విభవమేల? 11

సునం—చెలికాఁడా! వీరుండవైనయట్టి నీ కబలాజనంబువలె వాపోవుట పాడిగాదు.

సుద—సీ॥ కనులఁ జీఁకటి గ్రమ్మెఁ గాదు లోకంబెల్ల
నంధకారావృతం బగుచునుండె;
కలఁకె నాచిత్తంబు కాదు విశ్వంబెల్ల
నెరయు విభ్రాంతి మునింగియుండె;
గడగడ వడఁకె నాయొడలెల్లఁ గాదు భూ
వలయమంతయును జంచలతఁగాంచె;
కుతకుత నుడికె నెక్కుడుగ నాతనువెల్లఁ
గాదు చూడఁగ ముజ్జగంబులుడికె;
గీ॥ కటకటా! వెఱ్ఱినై యిట్లు గాంచుచుంటిఁ
గాదె తనకల్మి యింద్రభోగంబనంగ
నాత్మమరణంబు సర్వలోకాంతమనఁగఁ
జనెడు సామెత నాయందు సఫలమయ్యె॥ 12

సునం—హితుఁడా! అదృశ్యులైన వారినిఁ గనుఁగొన యత్నింపవలయును గాని కత్తి వానివలెఁ బ్రాణములపై నాస విడిచియుందురా? కానిమ్ము. అంతఃపురాంగనల కేమి నేడుగాకున్న రేపయిన దొరకఁగలరు. ఆచోరాగ్రేసర చక్రవర్తి, చక్రవర్తిగారినుండి తప్పించుకొనిపోయెను. తదన్వేషణ మిప్పుడు కర్తవ్యమని యూహింతును.

సుద—ఆహా! మిత్రమా! మోసము జరిగియుండవచ్చును.

గీ॥ అరుణవంశపయోరాశి నవతరించి,
యఖిల లోకప్రసిద్ధ వీరాగ్రగణ్యుఁ
డగు సుదర్శను వరియించి, యాదిలక్ష్మిఁ
బోలియును జిక్కువడితె! కరాళుచేత॥ 13

హా! దేవీ! విద్యున్మాలా! నీదురవస్థం దలంచుకొనిన కొలంది

చ॥ నలువరి వజ్రతుల్యమగు నాహృదయంబు గరంగి నీరగున్
దళిత మృగేంద్ర సత్త్వమగు నా ఘనబాహుబలంబు బెండగున్
వలవల జారు బాష్పముల నా నయనంబులఁ జూడ్కి స్రుక్కుడుం
దెలియఁగ నర్ధదేహమవు నీవు నశింప సగంబనిత్తునే॥ 14

మిత్రమా! ఆమె తప్పక కరాళునిచేతఁ జిక్కనదనియే యెంచి నామనంబు పరిపరివిధంబులఁ బరివేదనఁ జెందుచున్నది.

సునం— అట్లే యనుకొనినను నీకంతగా విచారింపవలసిన పనిలేదు. మనము సేనతోఁ గోటం బ్రవేశించినప్పుడే దేవిడీదగ్గఱఁ గట్టుదిట్టముగాఁ గాపుఁ బెట్టితిమి. కావున నాతఁ డెచటికిఁ గాని, విద్యున్మాలతోఁ గూడఁ గాని కోటను విడిచి పోఁజాలఁడు. మన సేవకుల యిల్లిల్లు శోధించి హతశేషులయిన చోరుల నందఱిని బట్టితెండని నియమింతుమిన్న శోధించి యుండుటచేఁ గరాళుని విద్యున్మాలను గూడ మనవారలే బంధించి తేఁగలరు. కావున నింతలో నింత పరితాపము నకేల పాలయ్యెదవు?

సుద— నీవు చెప్పినది నిజమే కాని విద్యున్మాలకుఁ గూడ బంధనమే సంప్రాప్త మగునా?

క॥ మొనసి సుకవాణి బంధం
బునఁ జిక్కనయేని వంశపుంమున నస్మ
ద్ఘనబాహాయుగళజని
మున నే స్త్రీబంధనంబుఁ బొందఁగవలయున్॥ 15

[ఇరువురు రాజభటు లిరువుర చోరుల వెంటఁబెట్టుకొని ప్రవేశించుచున్నారు]

భటులు— [సమీపించి] మహారాజా! జయము. జయము.

సునం— ఏమిరా బానిసకొడుకులారా! తప్పత్రాగి యొడలెఱుంగక, అగపడిన పురజనుల నెల్ల నిట్లు నిర్బంధించి బాధపెట్టుఁడనియేనా రాజుగారు మీకిచ్చిన శాసనము? [అని వంకరకఱ్ఱతోఁ గొట్టఁబోవును]

భటు— అయ్యా! మేమా విషయమున నప్రమత్తులమై యుంటిమి.

సుద— ఓరీ! హతశేషులగు చోరులం బట్టుకొన మీరు చేసిన ప్రయత్నము లెవ్వియో చెప్పుఁడు.

ప్ర-భ- సీ॥ ప్రచ్ఛన్నవృత్తితోఁ బౌరవేషముఁ బూని
తిరిగి యిల్లిల్లు శోధించు టొకటి,
పానశాలల కేగి హారికఁ జెలరేఁగి
మాయఁగా జాడలు దీయు టొకటి,

పరదేశులట్లు సత్రువులలోఁ జేరి
యాహార వృత్తాంత మొరయు టొకటి,
బేహారులట్లుఁ బేట పల్లెలనుఁ జొ
వెట్టి యీగడలను బట్టు టొకటి,
సీ. ప్రోల బైరాగి వేసముల్ బూని తిరిగి
పురజనుల వేషభాషలఁ బోల్చు టొకటి,
పథికులట్లు తటాక కూపముల్ కరిగి
లీల వారల పల్కు. లాలించుటొకటి. 16

ద్వి-భ- అయ్యా! మేమిట్లు సంచరించుచుండఁ బురోపకంఠమునను న్న నిషాదవాటిక యం దొక పర్ణకుటీరమున వీ రిరువురును నా దృక్పథంబునఁ బడిరి. వీరి యా కృతివిశేషంబులం గాంచినను, వేషభాషలఁ బరికించినను, ఆ స్థానంబున కన ర్హులుగాఁ దోచి ప్రచ్ఛన్న వేషములనున్న వైరివర్గమువారు గానోపుదు రని సంశయించి యీ యిరువురిని దేవరవారి యొద్దకుఁ దీసికొనివచ్చితిని. పిమ్మట దేవర చిత్తము.

సుద—[అపవారించి] సునందా!

క. వీరల ముఖలక్షణముల
వీరల మృదులాంగములను వీక్షింపఁగ నీ
తీరున నిషాదులనియుం
జోరులనియుఁ గూడఁ జెప్పఁ జొప్పడునుగదా! 17

సునం—రాజా! దొంగలును మనుష్యుల వంటివారే. ఆకృతులనుబట్టియా ప్రభువులు యోగ్యతాయోగ్యతల నిర్ణయించుట?

సుద—సుజనులారా! మీ యాకృతులంబట్టి మీరు పౌరులవలెఁ గాన్పించుచుంటిరి గాని చోరులీ గ్రామంబునఁ బ్రవేశించి ప్రజాపీడం గావించుచు మాశాసనముం దప్పించుకొనుటకై మాయవేషముల నెన్నియో వయిచుచున్నారు. అందును వారి నాయకుఁడింకను నాకుఁ జిక్కకుండుటచే మిమ్ములను శంకింపవలసి వచ్చుచున్నది. కావున మీ యథార్థ్యమును వెల్లడించి మాచే విముక్తిం జెందుఁడు.

పౌ—రాజా! మీరు క్రొత్తగాఁ బరదేశమునుండి వచ్చినవారగుటచే నీయాస్థానవిశేషములు బాగుగ మీకు గోచరింపవు. కరాళుఁ డింతకాలము సజీవుఁడై కోటలో నుండఁజాలఁడు.

సుద—[మనంబున నించుక సంశయించి] మీరనినట్లే కాని యిప్పుడు దివాణమున నింతటి కార్యముల నొనర్చువా రెవ్వరు లేరుగదా!

ప్ర-పౌ-ఏచతురమతియైన లేకుండునా!

సుద-సునం-[ఒకరి మొగము లొకరు చూచుకొనుచుండిరి.]

సునం—చెలికాడా! నిజముగ జతురికయే యున్నయెడల నంతపనియుఁ జేసియే తీరును

సుద—అట్లనుకొనుట కయిన నంతఃపురస్త్రీల సందడియే కానమే ?

ద్వి-పౌ-స్త్రీజనము వెలవ విడుచుట కదియే కారణ మేల కాఁగూడదు ?

సునం - అట్లయినఁ గరాళుఁ డిందెచ్చటనైన భూగతమై యున్నాఁడేమో? మనముగూడ నిచ్చటినుండి శీఘ్రముగ లేచిపోవుటయే మంచిదని తోఁచుచున్నది.

ద్వి-పౌ- మహావీరుఁడవైన నీవు యుద్ధమునందు రాజుగారికిఁ జాలతోడ్పడియుందువు.

సునం- నేనుగాక నీవా తోడ్పడినది మూర్ఖుఁడా !

ద్వి-పౌ- నేనంత సాయపడినదియు మీరాజుగారికిఁ దెలియును. భగవంతునికిఁ దెలియును. కాని నీకేమి తెలియును ?

సునం-[రోషముతో] ఎన్నఁడును ముక్కు మొగ మెఱుంగని వీఁడఁట, మారాజునకు సాయముచేసెనఁట! రాజా ! ఏమిది ? నీకుఁగూడ నీదొంగలతోఁ గాలక్షేపము సేయ గుతూహల మగుచున్నది. [ప్రథమపౌరునివంక దేఱిపాఱ జూచి] నేను దొంగలని వ్యర్థముగాఁ జెప్పుటలేదు. అదిగో ! చూడుము. నీవు విద్యున్మాలకుఁ బ్రధానకాలమం దొసఁగిన వజ్రపుటుంగరము వీనివ్రేలిని మిలుకు మిలుకు మని మెఱయుచున్నది.

సుద—ఏమీ ! వీఁడింతటి మాయికులా సేవకా! వానివ్రేలియుంగరము నిటు తెమ్ము.

సేవ—[పుచ్చుకొని రాజున కిచ్చుచున్నాఁడు]

సుద—[చూచి విషాదముతో]

మ॥ ధర నాసేతుహిమాచలాంతమునఁ నుద్యద్దండయాత్రావళిన్
హరుహారన్ జయలక్ష్ములం గనిన నాహస్తంబు పెడఁద్రొక్కుచు బం

సునం — ఓయీ! నీవేమిచేసినను సరియే కాని నన్ను మాత్రము మేకోతినిగనే మార్చకుమా?

ద్వి-పా- ఇప్పుడు మార్చనేల! నీవిదివఱకే కోతివయితివి.

సునం — [భయముతో నొసలు చూచుకొని] నేను నిజముగాఁ గోతినైనయెడల నిన్ను గొండముచ్చును జేసెదను సుమా!

సుద — మిత్రమా! నీహాస్యప్రసంగముఁ గట్టిపెట్టుము. ఓ యింద్రజాలికా! ఏది నీవిద్యాప్రావీణ్యముం జూచెదము గాక!

ద్వి-పా- మహారాజా! ప్రతివిద్యయు నిందుకు సమయము లేక రాజిల్లదు. కాన క్షణకాలము మాకు సెలవొసంగినచో మాహేంద్రజాలవినోదమును ప్రకటింతుము.

సుద — అటులనే కానిండు.

పౌరు — [నిష్క్రమింతురు]

సుద — వర్షాగమనమునకై సస్యము నిరీక్షించునట్లు విద్యున్మాలకై నాహృదయ మెదురుచూచుచున్నది.

సునం — పీతకై నక్క వేచియున్నట్లు చతురికకై నేను నట్లే వేచియుంటిని.

సుద — సెరుఁదోడు నిట్టి ప్రసంగములు కూడనా?

సునం — చెలికాడా! నేనేమి గ్రుడ్డివాఁడనా? కుంటివాఁడనా? నాయానందమున కేమికొఱఁత!

[విద్యున్మాలా చతురికలు ప్రవేశించుచున్నారు]

సుద — [చూచి ఖేదమోదములు ముప్పిరిగొన విద్యున్మాల నెదుర్కొని కౌఁగిటంజేర్చి]

చ॥ సమరమునన్ విపత్తులను జక్కఁడఁగింపఁగ నెన్ని యెన్ని దా
ష్ట్ర్యములకుఁ జిక్కి, యెన్ని శ్రమలందితినో యవి యెల్ల నీముఖా
బ్జముఁ గనుఁగొన్నయంత నెడబాసె; సహా! విధి తంత్ర మెంత యు
బ్రమొ! మఱిఁ దానొకండు తలఁప న్మఱియొండు దలంచు దైవమున్.

విద్యు — నాథా! విపత్పరంపరలం దప్పించుకొని తిరిగి నీసాన్నిధ్యమును బొందుటచేత నాకు నట్టి యానందమే కలుగుచున్నది.

సునం — చతురికా దర్శనంబున నేను నట్టి తన్మయత్వమునే పొందుచుంటిని.

చతు — ఛీ! మూర్ఖుఁడా నీ కన్నిప్పుడు నామీఁద నేప్రసరించుచున్నది.

సుద — నీప్రియసఖియైన చతురికమూలముననే నేను బయల్పడి శత్రునాశనముం గావింపఁ గలిగితిని.

విద్యు—ఈ సమయమున జనకు లిచ్చటనుండిన మన యానందమునకుఁ బార ముండదుగదా!

[భానుమంతుఁడు ప్రవేశించుచున్నాడు]

సుద—ఆర్యా! కాశ్మీరాధిపుఁడైన సుదర్శనుఁడు నమస్కరించుచున్నాడు.

భాను-ఉ॥ ఏనటు దూరదేశమున కేగినయంత మదీయరాజ్యసం
స్థానముఁ జుట్టుకొన్న బలితంపు టుపద్రవముం దొలంచినా
మానము మారిన మెల్ల నభిమానము మెలర్పఁగఁ గాచినట్టి తే
జోనిధి నిన్ గృపామతిని జూచుచునాక ప్రశేసు శిమ్ములన్

రాజ్యపరిజయం దైకమత్యము బరిబలియున్నదా!

సుద—

మ॥ మనుముఖ్యుల్ మును గూర్చియుంచినవిధుల్ మామా కులాచారముల్
వనటన్ సంకరమాటచేఁ బ్రజల కుల్లాసంబు క్షీణించె; వృ
త్తి నిధానంబులు మారె; భేదమతు లాత్రిం గూర్చె; కాలానుసా
ర విరూఢిం దనుమార్పుల న్నిలిపి, సంరంభంబుఁ జల్లార్చితిన్॥ 21

విద్యు—తండ్రీ!

సీ॥ అఖిలవిద్యాపీఠ మైన కాశ్మీరమే
యుపదకుఁ గోర్కెలతో నొప్పు మొగము
అతిసితప్రభల నొప్పుగు హిమాలయము లే
చెలువను వజ్రాల శేఖరంబు
అసహాయరణశూరు లగు రాజపుత్రు లే
నెలఁతకిఁ గ్రాలు గ్రైవేయకంబు
అసమరత్నప్రభల్ పొసఁగు వింధ్యాద్రి యే
నెలఁతకుఁ జిఱుగంట లొలయు కాంచి

గీ॥ పుట్టి గంభీర వారాశి నవతరించు
మహిత భారత రాజ్యరమాలలామ

యనఁ దనర్చు విద్యున్మాల హస్తశీల
హస్తములు మోడ్చి నీకు జోహారు లొసఁగ॥ 22

[అని పాదముల నొరఁగుచున్నది]

భాను—నాగర్భమున జన్మించి, కీర్తిశాలివై నా వంశమ్మున కెట్టకట్టి నాకు యశంబుం దెచ్చినందులకు నేను పరమానందము నొందుచుంటిని, [సుదన్వుని నుద్దేశించి]

సీ. కన్నబిడ్డగ నింటఁ గల పెద్దలును నేను
గారవంబున నిను జెంగాంచినాము;
అస్మదాశ్రిత పండితాళిచే నిందాఁక
విద్య, బుద్ధియును జెప్పించినాము;
భక్తితాత్పర్యముల్ పరిక్షపిల్లఁగ నిమా
పెంపుమై నన్ను సేవించుచుండె;
మొనసి స్వయంవరంబుగ నాథుని యెంచు
నట్టిజాణగ నేటి కాంతేరె;
గీ. వరయ నిబాల యింతటిదాని కెడఁద
నిర్భరామోదమును గాంచి నిరుపమాన
చాతురీధుర్యఁ జేప్రు నీకొసంగుచుంటి
బాల నిఁక నేలు మా నరపాలమూర్తి!॥ 23

[విద్యున్మాల నుద్దేశించి] బిడ్డా! యీకుసుమదామమును నీప్రియుని కంఠమున నలంకరింపుము.

విద్యు—[అట్లు చేయుచున్నది.]

సుద—క. రమణీమణి నిజనకుని
సముఖమ్మునఁ దదీయ శాసనమహిమన్
రమణిఁ గృతార్థుల మైతిమి
సుమి! మనప్రేమములు వృద్ధిఁ జొప్పడుగాకన్॥ 24

భాను—[ఇరువురిం గూర్చి]

సీ. గృహరాజకార్య నిర్వాహణ వేళలయందు
ననోన్యసామరస్యమున మెఱసి,

సచివవర్గము మీరు సంతత విశ్వాస
పాత్రంబులై పరస్పరము నెలకొ
సాంఘికాచార ప్రచారంబు నొండొరుల్
సహనసంపదతోడ సంఘటించి,
తీతిఁ గష్టసుఖముల ఖేద మోదములు గాఁ
చక కార్యశూరత సంతరించి,
౨. మాకు ననుమతమైన యీ మార్గమింపు
నెరయ నానాట వృద్ధిలోనికిని దెచ్చి,
బహుళపరిపూర్ణ సమ్మోద వైభవమున
మొనసి మదిఁ గోరికలు తుదముట్టఁ గనుఁడు॥ 25

వత్సలారా! మీకింక నభిమతం బెయ్యది?

సుద — మీయనుగ్రహంబున సర్వంబు సంపన్నం బయ్యె. ఐన నిట్లగుంగాక!

మ॥ నరవిన్ హైందవు లేకబుద్ధిని గులాచార క్షుద్రధర్మాని యూఁ
దుదుగా! క్రైస్తవ మహమ్మదీయ వరహిందూ క్రైస్తవుల్ తన్మతాం
తర జాత్యంతర భేదముల్విడిచి మిత్రత్వంబుఁ గైకొంద్రుగా
క! రహింపఁ గల్గెదుగాక! మీదయను బోక్కంబా స్వరాజ్యంబొగిన్॥

భరత వాక్యము.

ఉ. ధారుణి జారచోర రహితంబుగ వర్ధిలుఁగాక! మానినుల్
భూరి పతివ్రతామహిమఁ బోకడఁబెట్టక దివ్యపూతసం
చారముఁ గాంత్రుగాక! నృపచంద్రులు నిత్య వినీతి సంపదల్
తోరముగా గణించి కృపతో భరియింతురుగాక! లోకమున్. 27

[అందఱు నిష్క్రమించుచున్నారు.]

ఇది పంచమాంకము

సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ.

అమ్మకమునకు

# ఆంధ్రనాటకములు.

శ్రీరాజా భుజంగరాయ కృతములు.

అభిజ్ఞాన శాకుంతలము :—ఆనందమునకు నిలయము, హాస్యమునకు పుట్టినిల్లు, ప్రేమాది శృంగార విలాసములకు పెన్నిధి. శాకుంతల దుష్యంతుల ప్రథమసందర్శన ఘట్టము, అనంతరశృంగార లీలలు చదువరులకుండెల ఝల్లుమనిపించును. శకుంతల అత్తవారింటికేగుతరి కణ్వుడు చూపినదుఃఖము కనుల బొటబొట నీరొలికించును. ఇందలి పద్యములు కేవలము రత్నపుతునకలు. వెల 0—12—0.

ఉత్తరరామచరిత్ర :—నాటకము లన్నిటిలోనికి నుత్తమమగు నాటకము ఉత్తరరామచరిత్రము. రావణసంహారానంతరమున శ్రీరాముడయోధ్యను పాలించుచు, ఎవ్వడో వొక చాకలివాడు పరుషవాక్యముల సీతపై ప్రయోగించెనని, గర్భవతియగు నా సాధ్వీమణి నడవులకు బంపెను. కథ యిచ్చట ప్రారంభమై కుశలవులు యుద్ధానంతరమున శ్రీరామునితో సన్నిహితమగుటతో ముగియును. ఇందు సీతారాముల దుఃఖము మతి విచారమును కలిగించును. కుశలవు యుద్ధ మతిభయంకరముగ నుండును. రామచరితామృతమగుటచే యిహపరసౌఖ్యదాయకము. వెల రు 0-12-0.

చారుమతి :—శృంగార రసప్రధానంబగు నీ నూతన నాటకము యాంగ్ల మహాకవి చందురిని ప్రఖ్యాత నాటకము ననుసరించి వ్రాయబడినది. స్త్రీల శృంగార భావములు, ప్రేమాతిశయములు, విరహతాపములు, నర్మోక్తులు, చతురోక్తులు, అత్యంతాహ్లాదముగ వివరింపబడియున్నవి. వెల 0—12—0.

శశిరేఖానాటకము :—ఆరవముద్రణము ఇదివరకే 15000 ప్రతులకు పైగా ఖర్చుపడియున్నవి. నృత్యగీతానుకూలములగు ఫారసీ హిందుస్థానీ మట్లు లనేకము లిందుగలవు. వెల 0—6—0.

ఆహా హా హా !

# అగ్గిరాముని చరిత్రము.

లోకభయంకర దుష్టచోరసర చక్రవర్తియగు అగ్గిరాముని చరిత్రము చిత్రవిచిత్రమైనగాథలతో నిండియున్నది. కథాసందర్భములో మహానందము కలిగేపట్టు చదువుచూవుండగా గభేలున సీనుమారి క్రొత్తచిత్రములు బయలుదేరుచుండును. అతిభయంకరమైనపట్టు చదువుచుండగా, గభేలున మరియొకక్రొత్తసీను ప్రత్యక్షమై కనుల మిరుమిట్లు గొలుపును దీనిని చదివినంతసేపు మరునిమిషమున యేమిజరుగునో తెలుసుకొనవలెనని ఆతురత కలుగుచుండును. గ్రంథము వెల 0—8—0.

భారతీ బుక్ హౌస్, ఏలూరు.

# మైరావణ చరిత్ర.

టక్కు టమార విద్యలకు, గజకర్ణ గోకర్ణ విద్యలకు, ఇంద్రజాల మహేంద్రజాల విద్యలకు, వాకట్టు కనికట్టు విద్యలకు మైరావణుని మించినవాఁడీ ప్రపంచములో లేడు. ఈలాంటి మహానుభావుని చరిత్ర ఎట్టి వింతలతో నిండియున్నదో చెప్పుటకు సాధ్యపడదు గదా! కావున చదివి యానందించండి    వెల రు 0—3—0

# దైవానుకరణము.

ఇది అద్భుతమైన నూతన నవల కొందరు మహాస్త్రీయులు జట్టుగా కూడి దైవమును ప్రతివిషయమున ననుసరింపఁగోరి, తాము చేయుం ప్రతికార్యమునందును "దైవమైతే యీసందర్భములో యేమి చేయును" అని తలంచుకొని ఆప్రకారము సంచరించుటకు ప్రారంభించి అతిచిత్ర విచిత్రగతుల సంచరింతురు. ఆయాపనులు ఆయాసందర్భముల చాల యానందమును కలిగించును. చదివితీరవలసిన గ్రంథము. అచ్చులోనున్నది. వలయువారు దరఖాస్తులు రిజష్టరు చేయించుకొనవలెను.

వెల రు 0—8—0

# బైబిలు పద్యకావ్యములు.

శ్రీరాజా భుజంగరాయ కవికృతము.

| | |
|---|---|
| మత్తయి సువార్త పద్యకావ్యము. | వెల రు 0—4—0 |
| మార్కు సువార్త పద్యకావ్యము. | వెల రు 0—4—0 |
| లూకా సువార్త పద్యకావ్యము. | వెల రు 0—4—0 |
| యోహాను సువార్త పద్యకావ్యము. | వెల రు 0—4—0 |
| రోమీయులు పద్యకావ్యము. | వెల రు 0—3—0 |
| గలతీయులు పద్యకావ్యము. | వెల రు 0—0—6 |
| క్రైస్తు మతసారము; 100 ప్రతులు. | వెల రు 1—4—0 |
| కొండమీఁది ప్రార్థన; 100 ప్రతులు. | వెల రు 2—8—0 |
| క్రైస్తవ గూఢార్థ ప్రదీపిక. | వెల రు 0—4—0 |
| సత్క్రైస్తవ శతకము | వెల రు 0—[illegible]—6 |
| Inner Doctrines of Christianity | 0—8—0 |